# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

సంపుటము : 66 | జనవరి-ఫిబ్రవరి 1989 | సంచిక : 1, 2

విడిప్రతి వెల ఇరువది రూపాయలు

## విషయానుక్రమణిక

జనవరి-ఫిబ్రవరి - 1989

# స్వవిషయం

ఆంధ్ర పుట్టుపూర్వోత్తరాల గురించి డా॥ టి. వి. జి. శాస్త్రి ఒక పురాతత్వ పరిశీలనను ఈ నెల భారతి పాఠకులకు అందించారు. ఆంధ్ర శబ్దానికి సంబంధించిన అనేకకరమైన వివరణలు ఎన్నో ఈ వ్యాసంలో ఉండటాన్ని గమనించవచ్చు.

శ్రీమద్భాగవతంలోని నవవిధ భక్తుల గురించి డా॥ వి. సత్యనారాయణగారు వివరించిన తీరు తృప్తిగా ఉంది. భాగవతానికున్న విశిష్ట ప్రాశస్త్యాన్ని వెల్లడి పరచగలదని ఆశిస్తున్నాము. భక్తిభావం వాస్తవానికి ఒక అనంత పారావారమే అవుతుంది కదా!

"జనార్దనీయం" కథద్వారా శ్రీ ఏల్చూరి విజయరాఘవరావు చదువరులకు సరికొత్త అనుభూతిని అందించగలిగితే త.రా.సు కన్నడ కథానిక "ఇంకొక ముఖం" తెలుగు అనువాదం ఎన్నో ఆలోచనలను రేపి రసార్ద్రతను సాధించగలదని నమ్ముతున్నాము.

డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద శివశక్తి "తాత్విక శాంకర్య లహరి"లో మునక లేసేవారికి ఎంతో అనురక్తిని కలిగించగలదు. "శివ", "శక్తి" వెనక దాగిన విలాక్షణిక తత్వభావన ఎంత అమోఘమైనదో, ఎంత అమూల్యమైనదో ఆలోచనాపరులకు అంతకంతకూ చిత్రంగా తోచగలదు.

ఇకపోతే మంచి కవిత్వం కావాలని కోరుకునేవారికి సంతృప్తిని కలిగించేలా ఈసారి సంచికలో అందిస్తున్న కవిత్వం రకరకాల మానవ భావాలకు, అనుభవాలకు గీటురాయిగా నిలుస్తూ ఇజాలు ముఖ్యం కాదు.... నిజాలు ముఖ్యమన్న విశ్వజన కళ్యాణ భావాన్ని సమకూర్చగలదని మా ఆశ.

ఆలస్యంగా వస్తున్న భారతిని ఇకమీదట ఏ నెలకు ఆ నెల అందించాలనే ఉద్దేశ్యంతో ఈసారి జనవరి, ఫిబ్రవరి సంచికలను కలిపివేస్తున్నాము. త్వరలోనే భారతి ఒక నెల ముందుగానే చదువరుల చేతుల్లో ఉండేలా ఏర్పాట్లు చేస్తున్నాము.

భారతి తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంలా ఉండడానికే నిత్యం కృషి చేస్తుంది. అయితే ఇందుకు రాసేవారి, చదివేవారి సహాయ సహకారాలు ఎంతయినా అవసరం. అవి పుష్కలంగా అందగలవనే ఆశిస్తున్నాము.

# అంతరంగము

## శ్రీ పులికంటి కృష్ణారెడ్డి

మాట గారడీల మనుజుల నాకట్టి
వంచనమ్ము సేయ; పంచదార
చేదు మాత్రకంత చేర్చిన రీతిరా
కంటి నలుసుర పులికంటి మాట!

రంగు గుడ్డగట్టి రాణించవలెనన్న
పొట్టి నక్కబుద్ధి పోల్చలేమె?
అంతరంగమేదో అందరి కెరుకరా
కంటి నలుసుర పులికంటి మాట!

ఎవడు గద్దెనెక్కె అవినీతి మార్గాల
వాడె నీతియనుట చూడబోతె
గొంగడందు కూడు కుడుచుట రీతిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

పొందినపుడు పొగడి పొందకున్న తెగడి
వన్నెకెక్కువాడి వన్నెలెన్ని?
నరములేని నాల్క నాట్యమ్మె నాట్యమ---
కంటి నలుసుర పులికంటి మాట!

జనము నాడి తెలిసి జన్మలెత్తువాడు
నాకు నీకు కూడ నాయకుండె!
నాడి తెలియకున్న వాడెట్టి వైద్యుడు
కంటి నలుసుర పులికంటి మాట!

తలలు శూన్యమైన తరము వర్ధిలుదాక
మనిషి కొక్కపేన మహిమ మహిని
గొర్రె వెనుక గొర్రె గొంతెత్తురీతిరా
కంటి నలుసుర పులికంటి మాట!

డా॥ టి. వి. జి. శాస్త్రి

# ఆంధ్ర పుట్టుపూర్వోత్తరాలు - ఒక పురాతత్వ పరిశీలన

ముందుమాట :

ఆంధ్ర అనే పదం ఇప్పటికీ మన దేశానికి భాషకి వాడ్తూ వుంటాం. దీనినిబట్టి ఆంధ్రదేశ భాష, ఆంధ్ర భాషగా గుర్తిస్తున్నాం. కాని ఆంధ్రదేశమే తెలుగుదేశమని, ఆంధ్ర భాషే తెలుగుభాష అని కూడ చెప్పుకుంటూ వుంటాం. ఆంధ్ర, తెలుగు, ఒకే దేశమును ఒకే భాషను నిర్దేశించినట్లైతే విడి విడి పేర్లతో ఉండనవసరములేదు. అయితే మొదట ఒక దేశములో ఒక భాష వుండి, కాలక్రమేణ కొన్ని మార్పులు చేర్పులతో, మరో పేరుతో రూపొందటం రెండు విడి విడి కాలమానాలను సూచించుచున్నదని గ్రహింపవచ్చును. ఇట్లు వచ్చినవి తెలుగు, ఆంధ్ర పదాలు. నిజానికి ఆంధ్ర అను పదం చాలా పురాతనమైనదని అనుకుంటూ వుంటాం. ఎందువల్లనంటే ఆంధ్ర అనే పదం, ఐతరేయ బ్రాహ్మణం, రామాయణం, భారతం[1], పురాణములు మొదలగు ప్రామాణిక గ్రంథములలో విరివిగా కన్పించును, కాని వీటిలో తెలుగు అనే పదం దేశానికిగాని భాషకుగాని కన్పించుటలేదు.

ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యంలో (సంపుటం-1) తెలుగు సాహిత్యం అతి పురాతనమైనదని శాసనములను గ్రంథములను చూచి ఆదిమవాసుల భాషలలోని సామ్యములను గుర్తించి చెప్పేరు.[2] ఈ పరిశోధనలదృష్ట్యా ఆంధ్ర అను పదముకన్న, తెలుగునకు అగ్రతాంబూల మివ్వవచ్చునేమో కాని భాష వ్రాత వేరుచేసి చూసినచో వీటి తారతమ్యము విశదముగా తెలియుచున్నది. నిజానికి తెలుగుబాష, సాహిత్యం వ్రాత రూపములో నన్నయ కాలము తరువాత, ప్రాముఖ్యత నొందెనని చెప్పుకొనవచ్చును.

కాని తెలుగు అనే పదానికి చరిత్రకారులు, భాషా శాస్త్ర పండితులు అనేకులు అనేక రకములుగా చెప్తారు. కాని ఇది తిలింగమని తరువాత త్రిలింగ, త్రికలింగగా మారినట్లు, శక్తి సంగ్రహ తంత్రమను మధ్యకాలీన గ్రంథమునుండి గ్రహింపవచ్చును.[3] దీనిలో తిలింగ, ఆంధ్రదేశములోని అంతర్భాగముగ గుర్తింపబడియున్నది. మరియు త్రిలింగమనగా మూడు శివ క్షేత్రములైన శ్రీశైలము, దాక్షారామం, కాళేశ్వరం కలిగిన దేశమని ఉదహరింపబడియున్నది. క్రీ.శ. 14వ శతాబ్దమునకు చెందిన శ్రీరంగములో దొరికిన రాగి శాసనములలో త్రిలింగ దేశమునకు ఎల్లలను సూచించెను. దీని ప్రకారము ఈ దేశమునకు పడమర మహారాష్ట్రము, తూర్పున కళింగము, దక్షిణమున పాండ్యదేశము కలవు. ఈ ఆధారములనుబట్టి తెలుగుదేశం బాషా సాహిత్యం, లిపి మొదలగునవి క్రీ.శ. 12వ శతాబ్దమునకు తరువాత ప్రాముఖ్యత నొందెనని చెప్పవచ్చును.

ఇక ఆంధ్ర అనే పదం దేశం, మనుష్యలు, లిపి మొదలగువాటికి ఎట్లు వర్తిస్తుందో తెలుసుకుందాం. వ్యాస మహాభారతంలో ఆంధ్రులు ఒక తెగగా గుర్తింపబడ్డారు. వీరు బర్బరులు, పుళిందులు, శకులు మొదలగువారితో వింధ్యపర్వత ప్రాంతమున యుండెడివారని వ్రాయబడియున్నది. తరువాత వీరు గోదావరి, కృష్ణానదీ తీరప్రాంతములను జయించి, రాజ్యములను సంపాదించెనని చరిత్ర పురాతత్వ పరిశోధనల వలన తెలియుచున్నది. అయితే పురాణములలో ఉదహరింపబడిన ఆంధ్ర రాజులకు శాతవాహనులను వేరొక నామము కలదు. పురాతన నాణెములలోను రాతి శాసనములలోను వీరికి సాతవాహనులని ఉదహరింపబడ్డది. దీనినిబట్టి ఆంధ్రులే శాతవాహనులని, సాతవాహనులని కూడ వ్రాతపూర్వకమైన ఆధారములు కలవు. అయితే ఆంధ్రజాతి, కృష్ణా గోదావరీ ప్రాంతముల నాక్రమించుకొని మహారాజ స్థాయికి ఎగపి దేశమునకు ప్రజల

సంక్షేమమునకు దోహదపడి 'అప్రతిహతులు'గ చెల్లుబడియగుట ఆ కాలమున వారి ఉన్నతస్థితిని నిర్దేశించుచున్నది. యావద్దక్షిణా పథం వీరి యేలుబడిలో యుండెడిది. ప్రాకృత గ్రంథములలో వీరిది 'అంధాపదం' అని ఉదహరింపబడియున్నది.[4] శాసనము లలో దక్షిణాపథ దేశమని, శాతవాహనరర్ఠమని పేర్కొనబడి యున్నది. కాగా ఆంధ్ర అనే పదం సంస్కృతి, శిల్ప, కళ, వాస్తువు, మొదలగువాటికి కూడ వాడ్తూవుంటాం కృష్ణా నదీ పరీవాహక ప్రాంతమందు, అమరావతి, నాగార్జునకొండ, గోలి, జగ్గయ్యపేట, ఘంటసాల మొదలగు బౌద్ధ క్షేత్రములలో, సున్నపురాయిలో మలచిన, ప్రపంచ ప్రఖ్యాతినొందిన ఆంధ్ర శిల్పము కలదు వీటియందున్న కళ 'మధ్యధరా' సముద్రతీర ప్రదేశములలో, చైనా, జపాన్ మొదలగు దేశములలో, అత్యుత్తమమైనదిగ గుర్తింపబడినది. ఇవిగాక భాషా, సాహిత్యం, శాస్త్రములు జైన బౌద్ధ మతములు, ఆంధ్ర సంస్కృతిని పెంపొందింపజేసెను.

అయితే పరిశోధనదృష్ట్యా, ఆంధ్రదేశము నేలిన రాజులు, ఆంధ్రులా? సాతవాహనులా? వీరు ఒకే వంశమునకు చెందిన వారైనచో పైన ఉదహరించినట్లు వీరి కాలమానములో తేడా యున్నదా, భిన్నములైన పేర్లు ఎట్లు వచ్చెను. అను ప్రశ్నలను ఎదుర్కొనవలసియున్నది.

ఆంధ్రదేశము :

పై ప్రశ్నల జవాబులు తెలుసుకొనుటకుముందు, ఆంధ్ర దేశపు భౌగోళిక వ్యవహారములు, సహజ సంపద ఇరుగు పొరుగు దేశములు, వాటి ఎల్లలు తెలుసుకొనుట అవసరము. ఆంధ్రుల స్వాధీనములో ఉన్న ఆనాటి 'దక్షిణాపదేశ్'కు ఇప్పటి 'ఆంధ్రప్రదేశ్'కు రాజ్యాంగరీత్యా కొన్ని మార్పులు చేర్పులు ఉన్నప్పటికీ, మౌలికంగా ఎక్కువ తేడా కనిపించదు.

ఉత్తరమున వింధ్యపర్వతశ్రేణి నానుకొని, పశ్చిమము నుండి తూర్పుగా ప్రవహించి బంగాళాఖాతములో కలియు గోదావరీ పరీవాహక ప్రాంతము, పడమర మహారాష్ట్ర కర్ణాటక దేశములను కలుపు సహ్యాద్రికొండల వరకు, దక్షిణమున ఉత్తర కర్ణాటకనుండి తూర్పు కోస్తా ప్రాంతమువరకు తూర్పున తమిళ ఓఢ్ర దేశములను కలుపు కోస్తా ప్రాంతములకు మధ్యస్థ దక్కన్ పీఠభూమి ఆంధ్రదేశముగ నిర్దేశింపవచ్చును. ఈ భూభాగమునందు సజీవ స్రవంతులైన కృష్ణా గోదావరీ నదులే గాక, వశిష్ఠ, గౌతమీ, గోస్తనీ, వంశధార, శారద, తుంగభద్ర, పెన్న మొదలగు నదులు ఉపనదులు ఉన్నట్లు శాసనములలో గ్రంథములలో ఉదహరింపబడియున్నది.[5] ఇవి అన్నియు ఇప్పటికినీ దేశమును సస్యశ్యామలము చేయుచున్నవి.

మరియు ఈ భూఖండమునందున్న తూర్పు కనుమలలోని శ్రీశైలప్రాంతము బంగారము, ఇనుము, రాగి, సీసము మరి ఇతరములైన లోహసంపదకు పుట్టినిల్లు.[6] ఇవిగాక మానవాభ్యు దయమునకు దోహదపడు పశువులు, పశుసంపద, వన్యములు, వన్యసంపద మొదలగువాటికి ప్రసిద్ధి గాంచినది. ఇప్పటికినీ కృష్ణానది ప్రవహించు పర్వత ప్రాంతములయందు, అమూల్య మైన వజ్ర వైడూర్యములు, నీల గోమేధిక పుష్యరాగములు, మరకత మాణిక్యాది స్ఫటికములకు నిలయమైయున్నది. ఈ సంపదను పురస్కరించుకొని, వ్యాపారము, వాణిజ్యము, విదేశ సంబంధములు మొదలగునవి అభివృద్ధియైనట్లు గ్రహింప వచ్చును. వ్యాపార వాణిజ్యములవలన మతములు, భాషలు, సంస్కృతి మొదలగునవి సాంఘిక సంక్షేమమునకు దోహదపడె నని చెప్పవచ్చును. దీనినిబట్టి పురాతన 'అంధాపథం' నాగరికతలో ఒక విశిష్ఠస్థానమును సంపాదించెనని చెప్ప వచ్చును.

ఆంధ్రభాష :

ఇప్పుడు వ్యవహారములోనున్న తెలుగుభాష మధ్య కాలమునుండీ వచ్చుచున్నదని తెలుసుకొంటిని. ఇంతకుముందు వ్యవహారములోనున్న భాష, ఎట్లుండెనో అన్న ప్రశ్నకు సరి యైన సమాధానము చెప్పుట కొంచెం కష్టం. కాని ఆ భాషకి ఇప్పటి తెలుగునకు తేడా యుండెడిదని గ్రహింపవచ్చును. ఇప్పటి భాషలో కూడ వ్రాత ఒకటైన వివిధ ప్రాంతములలో, మాటలలో, ఉచ్చారణలో భేదములు కన్పించుచున్నవి. మౌలికముగా భావము తెలుసుకొనుటకు ఇబ్బంది లేనప్పటికీ, మాండలిక ప్రభావముచే మాటలో క్రొత్తదనము స్ఫురించును. ఆనాటి 'అంధాపథ' భాష కూడ అనేక మార్పులకు చేర్పులకు గురి అయియుండవచ్చును. ఏ భాషైనా ఇచ్చి పుచ్చుకొనుటలు వుంటే కాని దేశదేశాంతరములందు ప్రచారమునకు అర్హత యుండదు. ఆనాటి భాష జనరంజకమై సరళమై యుండుట వలననే పూర్వపు ఆంధ్ర దేశమునకు ప్రాధాన్యత వచ్చెనని చెప్పవచ్చును.

అయితే 'కాల్డువెల్' మొదలగువారి పరిశోధనలలో, ఆనాటి ప్రాచీనాంధ్ర భాష ద్రవిడ సంప్రదాయమునకు చెందినట్లు

నిర్ధారణయ్యెను. ఆనాటి ద్రావిడ భాషలకు వ్రాత అనేది వుండేది కాదు. ఒక ద్రావిడ భాషలకే కాక యావద్భారత దేశభాషలకు వ్రాత అనునది తరువాత వచ్చిన ఉపకరణం. ఆ కాలమున భాష అనునది మాటలు, పాటలు, స్మృతులు, శృతుల రూపములో యుండెడిది. తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం మొదలగు దాక్షిణాత్య భాషలలో పదసామ్యము లుండుటవలన అవి ద్రావిడ భాషలుగా నిర్దేశింపబడినవి కాగా ఆనాటి ద్రావిడ భాషలు, విదేశములలోకూడ చోటు చేసుకున్నట్లు కొన్ని ఆధారములు కలవు. 'హేమెన్‌డార్ఫ్' అను జర్మన్[7] శాస్త్రవేత్త మధ్యధరా సముద్ర ప్రాంతమునుండి, దక్షిణ భారత దేశ భూభాగము వరకూ వ్యాపించిన బృహత్శిలా సమాధులలో కనిపించు పోలికలనుబట్టి వారందరూ ఒకే భాష, సంస్కృతికి చెందినవారని (ద్రవిడియన్ స్పీకర్స్ అని) నిర్ధారణ చేసెను.

ఇకపోతే ఆనాటి ఆంధ్ర భాషకీ, ఇప్పటి తెలుగు భాషకీ సామ్యములెన్నో యుండియుండవచ్చు కాని భాష గ్రంథస్థమైనప్పటినుంచి ప్రాకృత సంస్కృత ప్రభావమెంతో యున్నట్లు గ్రహింపవచ్చును. గ్రంథస్థమైన భాషకు సర్వకాలములందు సర్వదేశములందు ప్రచారమునకు వీలగును. ఆనాటి ఆంధ్ర భాష కూడ ప్రచారభాష స్థాయికి చేరియుండవలెను.

సహజంగా తెలుగుభాష ఇతరులు నేర్చుకొనుట కొంచెం కష్టమే. నామవాచకములు, సర్వనామములలోని డు, ము, వు, లు ఉపయోగించుట కష్టము. వీటిలోని 'ఉ'కారాంతము (అచ్చు) ప్రాకృత సంస్కృత భాషల రాకతో 'అ'కారాంతములు గల డు, ము, వు, లు ఉపయోగించు తికమకలకన్న నామవాచకములకు, సర్వనామములకు అంతమునందు 'క' చేర్చుట సులభమయ్యెను. 'క' అను (హల్లు) ఒకే అక్షరమగుటవలన భాషకి కొంత సౌలభ్యము, కొత్తదనము, కొంత ఆస్కారము అబ్బెనని చెప్పుకొనవచ్చును. ఈ మార్పు వలన అసలు భాష మారి అంతమునందు 'క' యుండుటవలననే 'అంతక'భాష అయ్యెను. అంతమున 'క' యుండెడిదని ఆనాటి బ్రాహ్మ శాసనములలోని స్వభావమునుబట్టి గ్రహింపవచ్చును.

**అంతక. అంధక, అంధా. ఆంధ్ర :**

పైన ఉదహరించినవాటి ఉచ్చారణలో కొంత భేదము కలదు. కాని మౌళికముగా కొంత సామ్యత గోచరించును. ఇవన్నియు ఒకే మాటను, ఒకే అర్థమును సూచించినచో పైన ఉదహరించినట్లుగ కాలానుగుణ్యముగ వచ్చిన మార్పులని చెప్పుకొనవచ్చును. మొదట ప్రాకృత సంస్కృత ప్రభావము వలన నామవాచక సర్వనామములకు అంతమునందు 'క' చేర్చబడెనని గుర్తించితిమి. ఇక ప్రాకృత సంస్కృతములైన ఆర్యభాషల ప్రభావము ప్రాంతీయ ఆంధ్రభాషపై ఎప్పుడు పడెనో విచారింతము.

దక్షిణ దేశమందు, మౌర్యుల కాలమువరకును ద్రావిడ భాషలకు 'లిపి' లేదు. వ్రాత రూపములో మనకు మొట్టమొదట సంక్రమించినవి 'అశోకుని' రాతి శాసనములు[9] ఇవిఅన్నియూ బ్రాహ్మి లిపిలో వ్రాయబడియున్నవి. కాని భాష ప్రాకృతము. వీటిని కర్నూలు ప్రాంతమునందున్న జొన్నగిరి రాజుల 'మందగిరి' రాయచూరుకు దగ్గరయున్న 'మాస్కి', ఉస్మానాబాద్‌కు సమీపముననున్న పాల్కిగుండు, గవీమఠ్ మొదలగు చోట్ల ఇప్పటికినీ చూడవచ్చును కాని మౌర్యుల కాలమునకు ముందే జైన బౌద్ధ మతములు వ్యాపంతిముద్వారా చోటు చేసుకొనెను. వీటివలన భాషలో కొన్ని మార్పులు వచ్చియుండవచ్చును. కాగా ఆర్యభాషల ప్రభావము, అగస్త్య మహాముని కాలమునుండీ యుండవచ్చును. ఆర్య సాంప్రదాయములను దక్షిణ దేశమునకు తీసికొని వచ్చినవారిలో ఆదిపురుషుడు అగస్త్యుడు.[10] ఇందువలన ఆనాటి ఆంధ్రభాషలోనే మార్పులు కాలానుగుణ్యముగ వచ్చెను. అశోకుని తరువాత యీ మార్పులు శాసనములలో బ్రాహ్మి లిపిలో ప్రతిబింబించెను. ఇప్పుడు మౌర్యుల కాలమునాటికి కృష్ణా గోదావరీ ప్రాంతభాష 'అంతక' భాష ఎట్లయ్యెనో బ్రాహ్మిలిపి శాసనములు, బౌద్ధుల పురాణ గ్రంథములు ఆధారముగ తీసుకొని విచారింతము.

క్రీ.పూ. రెండు మూడు శతాబ్దములకు పూర్వమే వ్రాయబడిన శాసనము భట్టిప్రోలు త్రవ్వకములలో బయటపడెను[11] బుద్ధుని ధాతువులను భద్రపరచిన ఒక పెద్ద రాతిభరిణె మూతపై 'కుబిరకు'డను రాజు పేరు లిఖింపబడియున్నది. ఇటీవల 'వడ్డమాను' కొండపై 'సోమకుడ'ను రాజు పేరు బయటపడెను[12] అచట త్రవ్వకములలో వచ్చిన మృణ్మయపాత్ర శకలముల పైన బ్రాహ్మిలిపిలో వ్రాయబడిన ప్రాకృత శాసనములు దగ్గర దగ్గర 140 వరకూ యున్నవి. వీటిలో మతగురువుల పేర్లు ఊళ్ళ పేర్లు, మనుష్యుల పేర్లు చివర 'క' అంతము గలిగి యున్నవి మరొక రాతి శాసనములో వడ్డమాను నెవాసికస, సమాతుకస, పితుకస, సభాతుకస మొదలగు మాటలన్నియు 'క'అంతము గలిగియున్నవి[13] నాణెములపైనున్న రాజుల పేర్లలో సెబక, అపిక మొదలగునవి కలవు బౌద్ధ జాతక కథలలో ఒక ఆంధ్ర రాజుపేరు 'అంధక వెష్ణు' అని వ్రాయబడి

యున్నది ఉదహరింపబడియున్నది. ఈ కథ నాగార్జునకొండ శిల్పములలో కనుపించును.

గోదావరీ పరీవాహక ప్రాంతములలో 'మూలక, అసిక' అను సంపన్న దేశములు గలవని సుత్తనిపాత అను బౌద్ధ గ్రంథములో యున్నది.[14] ఇవి 'అంధక' దేశములోని భాగములుగ పేర్కొనబడినవి అమరావతిలో 'చైత్యకు'లను బౌద్ధ భిక్షువులచే మహాచైత్యము నిర్మింపబడినట్లుగ ఒక శాసనములో యున్నది.[15] పైన ఉదహరించిన శాసనములన్నియూ రమారమి క్రీస్తుకు పూర్వము రెండు వందల సంవత్సరములనాటివని గ్రహింపవచ్చును. ఇవిగాక 'క' అంతమునందున్న నగరముల పేర్లను కొన్ని పురాతన గ్రంధములనుండి సేకరింపవచ్చును. గోదావరి పుట్టుక స్థానమునకు పైన పశ్చిమ సముద్రము నానుకొనియున్న దేశమునకు అపరాంతక, సోపరాంతక అను పేర్లతో పిలువబడెడిది.[16] ఇది వ్యాస భారతమునుండి తెలుసుకొనవచ్చును. పూర్వపు సోపరాంతకయే శూర్పారక ఇప్పటి పేరు 'సోపార'. ఇది బొంబాయి సమీపములోని పట్టణము. ఇది సాతవాహనుల కాలములో ఒక ముఖ్యమైన రేవు పట్టణముగ బౌద్ధ సాహిత్యమునందు వర్ణింపబడ్డది. గోదావరి పుట్టుక 'త్రయంబకము'. దీనికి సమీపములో 'నాసిక్' నగరము కలదు ఇవియు పౌరాణిక స్థలములు. శాసనములయందు ఉదహరింపబడియున్నవి. వీటి చివర 'క' యుండుట గమనార్హము.

పైన ఉదహరించిన విషయములన్నియూ, ఈ వ్యాసమునకు చివర ఒక పట్టిక రూపములో క్రోడీకరింపబడియున్నవి. వీటినిబట్టి కృష్ణా గోదావరీ మధ్యస్థప్రాంతమైన దేశమునకు, రాజులకు, మనుష్యులకు, పట్టణములకు 'క' అను అక్షరము అంతమునందుండుట ఆనాటి భాషలలోని ప్రత్యేకత. 'ప్రాకృతం వ్యుత్పత్తి అర్థమునుబట్టి సామాన్యులకోసం ముందు చేయబడిన భాషయని చెప్పుకొనవచ్చును. మౌర్యుల కాలమునుండి మనకు సంక్రమించిన బ్రాహ్మీ వ్రాతలోని 'క' అంతముగల భాష ఈ ముందు చెప్పబడిన (ప్రాకృత) భాషలోనే వున్నది. జైన బౌద్ధమత ప్రబోధకులచే ఈ అంతకభాష 'అంధక' భాషగా ప్రాముఖ్యత వచ్చెను. ఈ భాషా ప్రభావమువలననే దేశము గూడ అంధక దెశమయ్యెనని గ్రహింపవచ్చును 'కేంబ్రిడ్జి హిస్టరీ ఆఫ్ ఇండియా' అను గ్రంధములో 'సుద్దాంతకర్' ఏ దేశమునకైన పేరు ప్రతిష్టలు మనుష్యుల గొప్పతనమునుబట్టి యుండునని చెప్పెను.[17]

అయితే 'అంధక ప్రాకృత ప్రభావం క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దినుండి, క్రీస్తు తరువాత రెండు వందల సంవత్సరములకే యున్నట్లు తెలియుచున్నది. తరువాత వ్రాతలోను భాషలోను సంస్కృత ప్రభావ మెక్కువయ్యెను. ఇది తర్వాత వచ్చిన శాసనములవలన ఋజువగుచున్నది. నామవాచకములతో, సర్వనామములలో 'క' అంతము ఎక్కువ కనిపించుటలేదు. దీనికి కారణములు గలవు. భారతదేశమున అనేక రకములైన మాండలిక ప్రాకృత భాషలన్నియు, ఒకే రకమైన పాణినీయ సంస్కృతభాషగా సంస్కరింపబడెను. ఈ మార్పు కృష్ణా గోదారీ ప్రాంతీయ అంధక భాషకు కూడ వచ్చెను. సంస్కృతములో కొన్ని మాటల చివర 'క' ఉపయోగించుట అవసరము లేకపోయెను. ఏలనన బాలక అను పదమునకు 'బాల' అని చెప్పుకొనవచ్చును. మరికొన్నిటియందు 'క' యుండుట వలన మరొక అర్థము వచ్చుచున్నది. ఈ ముప్పు అంధక భాషకు అంధక దేశమునకే వచ్చెను. అంధక మనగా 'గుడ్డి' అని స్ఫురించుచున్నది కదా అని గుడ్డిభాష- గుడ్డి దేశము అని చెప్పుకొనుటచే అపకీర్తి పాలగును.

కాగా కృష్ణా గోదావరీ ప్రాంతమునకు, మధ్యధరా సముద్ర ప్రాంతీయ దేశములనుండి జావా, చైనా మొదలగు తూర్పు ప్రాంతీయ దేశములనుండీ విదేశ వ్యాపార మెక్కువగా యుండెడిది. విదేశ వ్యాపారములకు భారతదేశము మధ్యగా వుండుటవలన 'ఆంతరిక' దేశమయ్యెను ముఖ్యముగా కృష్ణానదీ ముఖద్వారమందు ఒక ముఖ్యమైన ఓడరేవు వుండెడిది. అది ముంజేరిక. ఈ తెలుగు పేరులో 'క' అంతము వుండుట ఒక విశేషము. 'ముంజేరిక' వ్యాపారమునకు ముఖ్య కేంద్రమని 'మహావగ్గ' అను బౌద్ధ గ్రంథమున కలదు.[18] అయితే 'ముంజేరిక' (ముందు చేరేది) అను రేవు పట్టణమునకు వ్యాపార భాషలో అనేక రూపాంతరములు కలిగియుండవచ్చును ముంజేరిక తెలుగు పదమైనా ప్రస్తుతం ఇది మాజేరు మాజేరిక అని పిలువబడుచున్నట్లు పురాతత్వ పరిశోధనలో తేలింది[19] కృష్ణాజిల్లా అవనిగడ్డ తాలూకాలో (మండలం) పాతమాజేరు, కొత్తమాజేరు, లక్ష్మీపురమను ప్రదేశములు కలవు. ఇవి చల్లపల్లికి సమీపములో యున్నవి. కె ఆర్. సుబ్రహ్మణ్యం వ్రాసిన 'సౌతిండియన్ బుద్దిస్ట్ ఏంటిక్విటీస్' అను గ్రంధములో ఈ మాజేరిక ఒక నాగవంశమునకు స్థావరమని బౌద్ధ కథలలో యున్నట్లు గుర్తించెను.[20] పాతమాజేరు, కొత్తమాజేరు పాటి దిబ్బలలో, పురాతన కుండ పెంకులు, రోమన్ నాణెములు,

పూసలు మొదలగు ఆనాటి అవశేషము లనేకములను సేకరింప వచ్చును.

పైన చెప్పిన ఆధారములను పురస్కరించుకొని అంధక దేశం ఆంతరిక దేశమై, సంస్కృతం ప్రాబల్యముగా ఉన్న రోజులలో ఆంధ్రగ మారియుండవచ్చును. రామాయణ భారత గ్రంధములోను పురాణములలోను, దేశమునకు, మనుష్యులకు, భాషకు ఆంధ్ర అను పదము ఉదహరింపబడియున్నది. క్రీ.శ. 3వ శతాబ్దానికి చెందిన శివస్కందవర్మ అను పల్లవరాజు మన దేశానికి అంధాపధమని ఒక శాసనములో వేయించెను. కాని ఈ శాసనం ప్రాకృతంలో వున్నప్పటికీ 'క' అంతము అంధాపధములో లోపించటం విశేషం. కాని అదే శతాబ్దానికి చెందిన మరొక శాసనంలో, నాగార్జునకొండలో దొరికిన ఒక శాసనంలో ఒక ఇక్ష్వాక రాజు తను సగరుడు, దిలీపుడు మొదలగు రాజులతో సమానుడని, చక్కటి సంస్కృతంలో వ్రాయించుకొన్నాడు.[21] ఈ శాసనములోనున్న సర్వనామములలో అంతమున 'క' కనిపించుటలేదు. ఇది సంస్కృత ప్రభావమువల్లనేనని గ్రహింపవచ్చును. అయితే తరువాత వచ్చిన నాల్గవ శతాబ్దపు ప్రాకృత శాసనములో 'క' అంతము కన్పించుచునేయున్నది.[22] సముద్రగుప్తుని అలహాబాదు శాసనంలో తను జయించిన దక్షిణదేశ రాజ్యముల అంతమందు కౌరాళక, కోసలక, వైంగేయక, పైష్టపురక అను వాటియందు 'క' కనిపించును. ఇది సంస్కృత శాసనము వీటినిబట్టి ఆంధ్రుల తర్వాత, ఆంధ్రుల సంప్రదాయ ఛాయలు, శాసనములలో కన్పించుచున్నట్లు గ్రహింపవచ్చును.

సాతవాహన :

ఇది ఆంధ్ర అనే పదమునకు పర్యాయ పదముగ ఉదహరింపబడినది. చారిత్రకంగా ఈ వంశమునకు చెందిన మొదటి రాజు 'సిముకుడు'. ఇతని పేరునకు చివర 'క' యుండుటచే ఇతడునూ ఆంధ్ర రాజేనని తెలుసుకొనవచ్చును. కాని కొన్ని నాణెములలోను, శాసనములలోను 'రాజ్ఞోసిముక సాతవాహన' అని యుండుటచే ఇతడు 'సాతవాహన' కులస్థునిగ చరిత్రకారులు గుర్తించుచున్నారు.[22] తరువాత వచ్చిన రాజులలో కూడ సిరిసాతకణి, గోతమీ పుతసాతకణి, అను పేర్లు, నాణెముల లోను, శాసనములలోను యుండుటవలన వీరు 'సాతవాహనులు గానే గుర్తింపబడ్డారు. సిముకుడు, మౌర్యుల ప్రాపకమువలన 'అస్సక మూలక' అను గోదావరీ ప్రాంతీయ దేశముల కధిపతియై, క్రమేపి వారి ప్రభావము తగ్గిన తరువాత గోదావరీ సోపరాంతక, సహ్యాద్రి ప్రాంతములను జయించి సాతవాహన కులరాజ్యమునకు (ఆంధ్ర) నాంది పలికెను. వీరు యజ్ఞ యాగాది క్రతువులు చేసినట్లుగ ఆధారములున్నవి. సాతవాహనులు మౌర్యుల సామంతులుగ యుండి వారి సత్సాంప్రదాయములను అలవరచుకొనిరి. ముఖ్యముగా సర్వమానవ సౌభ్రాతృత్వము, మత సమానత్వములను పాటించి ప్రజలను కన్నబిడ్డలవలె చూడవలెనను అశోకుని సాంప్రదాయములను పాటించిరి. మంచిని ప్రోత్సహించిరి. చెడును నిరోధించిరి. దీనివలన ప్రజాభిమానము చూరగొని రాజ్యమునకు స్థిరత్వమేర్పరచుకొనిరి.

ఆంధ్ర రాజులలో పుళమావి యొకడు. ఇతని నాణెములు పురాతత్వ పరిశోధనలు త్రవ్వకములలోను కృష్ణానదీప్రాంతమున కోస్తా ప్రాంతములలో కర్ణాటకమున యెక్కువగా దొరికెను. ఇతని పేరు వాయు, భాగవత, మత్స్య మొదలగు పురాణము లన్నింటిలోను కలదు. కాని వరసక్రమంలో భేదము కన్పించు చున్నది. కొన్నిటిలో ఆ రాజు 10వవాడని మరొకదానిలో 12 అని ఉదహరింపబడియున్నది. పైగా పుళమావి అను పేరుతో ఇద్దరు ముగ్గురు కలరు. ఇతడు మొదటి 'పుళమావి' అయివుండవలెను. ఇతని పేరునకు చివర సాతవాహన అనునది కన్పించుట లేదు. దక్షిణదేశమునందు ఎక్కువగా ఈతని నాణెములు దొరుకుటవలన కోస్తా ప్రాంతము, శ్రీశైల ప్రాంతము మొదలగునవన్నియు ఇతడు కైవసము చేసుకొనియుండవలెను. త్రవ్వకములలో 'పుళమావి' నాణెములు క్రీస్తు 100 సంవత్సరముల తరువాతవాడని ఋజువగుచున్నది.[23] నతబ్రాహ్మణ, దక్షిణాపధపతి అని చెప్పుకున్న గౌతమీపుత్ర సిరిసాతకణి, అనునతడు ఈతని తరువాత వచ్చినవాడే. దీనినిబట్టి మొదట సాతవాహన రాజులు, గోదావరీ ప్రాంతమునకు రాజ్యాధిపతులై, క్రమేపి దక్షిణాపధపతులై, ఆంధ్రులను పేరుతో దక్షిణాదిన మౌర్యుల వారసులుగ పేరొందిరి.

చివరిమాట :

మెగస్తనీసు వ్రాసిన క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దము నాటి 'ఇండికా' అను గ్రంధములో దక్షిణదేశపు మగధ సామ్రాజ్యమును రెండు భాగములుగ జేసి తూర్పున కళింగము, కోస్తా ప్రాంతములు ఖారవేలుని రాజ్యముగను పడమర సాతవాహనుల రాజ్యముగ గుర్తించెను. దీనినిబట్టి కృష్ణానదీ ప్రాంతమును, దక్షిణ ప్రాంతములను ఏలుచున్న కళింగులు సాతవాహన రాజగు పుళమావిచే క్రీస్తునకు 100 సంవత్సరముల తరువాత ఓడింపబడిరని చెప్పుకొనవచ్చును. ఇది వడ్డమాను త్రవ్వకము

లలో నిరూపింపబడెను. వీరిసదన, మహాసదన, సివమకసదస, అను పేర్లతో ఉన్న నాణెములు క్రీస్తునకు పూర్వము 50 సంవత్సరముల తరువాతవారని తేలుచున్నది. ఈ సదసరాజులు ఖారవేలసంతతివారని 'గుంటుపల్లి'లో దొరికిన శాసనముల వలన బయటపడెను.[24] ఇందువలన సాతవాహనులు యావద్దక్షిణ దేశ మౌర్య సామ్రాజ్యమునకు క్రీస్తు 100 సంవత్సరముల తర్వాతనే కైవసము చేసుకొనిరని తేలుచున్నది. దీనితో యావదాంధ్ర దేశము రాజ్యాధిపత్యము లభించెను. వీరి సత్సాంప్రదాయముల వలననే, ఇప్పటికినీ భారతదేశ రాజ్యాంగంలో స్వయంప్రతిపత్తిని నిలుపుకొనగలిగితిమి.

## ఈ పరిశోధనలో బయటపడ్డ 'క' అంతమునందున్న కొన్ని మాటల పట్టిక

| మాట పేరు | నిర్దేశించునది | ఆధారములు, సూచిక |
|---|---|---|
| అంధక | దేశము | కథావస్తు |
| అస్మాక | " | పాణిని, అష్టాధ్యాయి మార్కండేయ పురాణం |
| మూలక | " | ఎర్లీ హిస్టరీ ఆఫ్ దక్కన్ |
| అలక | " | " |
| రాష్ట్రిక(రర్ధిక) | రాష్ట్రము | రాక్ ఎడిక్ట్స్ ఆఫ్ అశోక |
| పాదేశిక | ప్రదేశము | " |
| దన్డక | అరణ్యము | రామాయణము, వాల్మీకి |
| కర్ణాటక | దేశము | మహాభారత |
| అపరాంత,సోపరాంత | " | " |
| అరియక | " | ఎర్లీ హిస్టరీ ఆఫ్ దక్కన్ |
| శూర్పారక | నగరము | మహాభారత |
| కర్హాటక | " | ఎర్లీ హిస్టరీ ఆఫ్ దక్కన్ |
| ముసిక | " | హథిగుంప ఇన్‌స్క్రిప్షన్ |
| నాసిక | " | ఎర్లీ హిస్టరీ ఆఫ్ దక్కన్ |
| ధాన్యకటక | " | ఎపిగ్రఫికా ఇండిక |

### అధోజ్ఞాపికలు :

1. ఐతరేయ బ్రాహ్మణమ్, 18.3 ఇంగ్లీష్ ట్రాన్స్‌లేషన్ బై హెచ్. మార్టిన్ 1863.
2. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (మొదటి సంపుటం) పే. 7-15.
3. చెంచయ్య .పి అండ్ రాజా భుజంగరావు, తెలుగు లిటరేచర్, పుట. 14.
4. నాగార్జునకొండ, (ఆర్కియాలాజికల్ మెమోయిర్స్) వాల్యూమ్ నెం. 71.
5. దత్. ఎన్. వి బి ఎస్, జియాలజి అండ్ మినరల్ రిసోర్సెస్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్. పు. 13, 21.
7. ఏన్సియంట్ ఇండియా, వాల్యూమ్. 8, పుట. 6.
8. సంస్కృతములోని మాతా, పితా, స్వసా, అను మాటలకు యూరోపియన్ భాషలలో సామ్యములున్నవి. ఇవి ఇంగ్లీషులో మదర్, ఫాదర్, సిస్టర్ అటులనే అవి ఫ్రెంచిలో మాటర్, పీటర్, సోవర్ అను రూపాంతరములలో నున్నవి. అటులనే పేసు అను మౌళికమైన మాట, సంస్కృతములో, తెలుగులో 'పశు' అని వాడుచున్నాము. దీనిని ఇంగ్లీషులో పెక్యూనియరి అను మాటను, డబ్బు సంబంధమైన అని చెప్పుకుంటున్నాము. ఆనాటి పరిభాషలో 'డబ్బు' అనునది పశు రూపములో యుండెడిది.
9. అశోకుని మరణము, గ్రీక్, పరిష్యన్, మొదలగు చరిత్రలలో క్రీ.పూ. 236 అని నిర్ధారణ చెయ్యబడ్డది. ఇది మన మౌర్య వంశచరిత్రకు కూడ సరిపోవును. ఇందువలన దక్షిణ దేశములోని అశోకుని శాసనములు క్రీ.పూ. 3వ శతాబ్దమునాటివని పరిగణింపవచ్చును.
10. అశోకుని కాలమునకే, దక్షిణ దేశమునందు యజ్ఞయాగాది క్రతువు లుండుటవలన, ఈ ఆర్య సంప్రదాయములు మౌర్యులకు ముందే యున్నట్లు తెలిసికొనవచ్చును. దక్షిణదేశపు గాధలలోను, సాహిత్యములయందును ఆర్య సంప్రదాయములను, అగస్త్యుడు తీసుకొని వచ్చినట్లు, ఆధారములు గలవు.
11. ఎపిగ్రఫియా ఇండికా వాల్యూం. 2
12. బుల్లెటిన్ ఆఫ్ బిర్లా ఆర్కియాలాజికల్ అండ్ కల్చరల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ సీరిస్ 2. పుట. 16.
13. పై సీరిసే. పు. 21.
14. ఏజ్ ఆఫ్ ఇంపీరియల్ యూనిటి (భవాన్స్ సీరిస్ వా. 4) పు. 193.
15. సీవెల్, రిపోర్ట్ ఆఫ్ ది ఎక్స్‌వేషన్స్ ఆఫ్ అమరావతి స్తూప (1877)
16. తతః శూర్పారకందేశం సగరస్తస్య నిర్మమే। సహస జగదజ్ఞస్య సోపరాంతక మీతలం॥

17. సుథంకర్ వి. ఎస్; కేంబ్రిడ్జ్ హిస్టరీ ఆఫ్ ఇండియా మహాభారతం 12. 4967, పు. 529.

18. టర్నర్, మహావగ్గ 13, 12.

19. బి. బి. ఎ. సి. ఆర్. ఐ. సీరిస్ 2. పు. 26.

20. సుబ్రహ్మణ్యం కె. ఆర్, సౌత్ ఇండియన్ బుద్ధిస్ట్ ఆన్‌టిక్విటీస్.

21. ఇండియన్ ఆర్కియాలజీ, ఎ రివ్యూ, 1957-1958 పుట. 5.

22. న్యూమిస్‌మాటిక్ డైజెస్ట్, 4. పు. 6.

23. శాస్త్రి టి. వి జి, వీరపురమ్, ఎ టైప్ సైట్ ఫర్ కల్చరల్ స్టడీ ఇన్ ది కృష్ణా వాలీ, 1984.

24. సుబ్రహ్మణ్యం కె ఆర్, గుంటుపల్లి బ్రహ్మీ ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ ఖారవేల (ఎ. పి. ఎపిగ్రఫికల్ సీరిస్-3).

---

# త్రికాలజ్ఞకవి

## శ్రీ కందాళై రాఘవాచార్య

గతాన్ని ఆలోచనకు సంధించి
మేలు కూర్పుల వర్తమానంగా తీర్చి
భవిష్యత్తును వక్రతారహిత దివ్యధామంగా నిలబెట్టేవాడే కవి
త్రికాల ప్రభంజనాల్లోనూ నిలబడేవాడే కవి
తప్పదు అక్షరాలే అస్త్రాలౌతాయ్ ధర్మసంస్థాపనలో
కవి హృదయగర్భంలో స్పందించే స్వయంభువులైన స్వరాలే
ఊపిరితిత్తుల్లోంచి
కాంతివేగంతో గొంతు పెగుల్చుకుని
ఈ వాతావరణానికి త్రికాల ఆలాపనా మంత్రాలౌతాయ్
వైతళిక గీతాలౌతాయ్
ఈ గీతాలే మృతవీరుల కళేబరాలపైనుండి ప్రసరించి
పోరాడే వీరుల చేతుల్లో శక్తిపాతాలౌతాయ్
తుపానులు కవి పాదాలకు మోకరిల్లి శుభోదయాలౌతాయ్
కవి ఈ వ్యవస్థ మజ్జలో ఊటుగా ప్రవాహాలైతే ప్రాణవంతమైన
స్థితిగతుల నియంత్రితమూర్తి కవి
కవి శరీరం విశ్వం
కవి ఆలోచన త్రికాలం

---

ఆచార్య కోర్లపాటి శ్రీరామమూర్తి

# శ్రీకృష్ణదేవరాయలు - నవరత్నకవులు అష్టదిగ్గజకవులు

(గతసంచిక తరువాయి)

**పింగళి సూరన :**

ఇక పింగళి సూరన. ఇతని రాఘవ పాండవీయము ఆకువీటి పెద వెంకటాద్రికి అంకితము. అతని తాత ఇమ్మరాజు రాజమహేంద్రవర యుద్ధమునందు విజయము నందినట్లు అవతారికలో కలదు. (25వ. 1అ) అది శ్రీకృష్ణదేవరాయలు 1515వ సంవత్సరమునందు విజయమునందిన రాజమహేంద్రవర యుద్ధమని, అందు ఇమ్మరాజు పాల్గొనియుండునని, అందువలన రాఘవ పాండవీయము రచనాకాలము 1564 పూర్వమని కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయము[57] పింగళి సూరన కళా పూర్ణోదయము నంద్యాల కృష్ణమరాజునకు అంకితము. ఇతని తాత నంద్యాల నారపరాజు కొండవీటికడ కుదుపనమల్కను జయించినట్లు అవతారికలో కలదు (33వ 1అ) అది కూడ శ్రీకృష్ణదేవరాయలు 1515వ సంవత్సరమునందు విజయము నందిన కొండవీటి యుద్ధమని, అందు నంద్యాల నారపరాజు పాల్గొనియుండునని, అందువలన కళాపూర్ణోదయము రచనా కాలము 1560 ప్రాంతమని కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయమే.[58] ఈ రెండు కారణములచేతనే రాఘవ పాండవీయము రచనాకాలము 1545 ప్రాంతమని, కళాపూర్ణోదయము రచనాకాలము 1550 ప్రాంతమని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము[59] ఇవి సంభావ్యములైన సమన్వయములే కాని, ఇంతకంటె సూక్ష్మముగ నంద్యాల నారపరాజు కాలము, నంద్యాల కృష్ణమరాజు కాలము తెలుపు శాసన ప్రమాణములు కలవు నంద్యాల నారపరాజు 18-3-1548వ తేదీని పల్లిపట్టు, గుండిపూడి అను గ్రామములు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి సమర్పించినట్లు తిరుపతిలో శిలాశాసనము కలదు.[60] నంద్యాల కృష్ణమరాజు ప్రసక్తి కల శిలాశాసనము 1605వ సంవత్సరము నందు కలదు. అది మట్ల అనంతభూపాలుని సిద్ధవటశాసనము.[61] అందు "వీర వెంకటరాయవిభుండు చంద్ర [గిరీంద్ర] సీమ సామ్రాజ్యంబు సేయుచుండ" మట్ల అనంతభూపాలుడు "నందేల క్రిష్ణమ నరనాథ భయ దానదక్ష దోర్దండ ఎచక్షణుండు" అని కలదు. ఈ వేంకటరాయలు 1585-6లో సింహాసనము నధిష్ఠించినట్లు, నంద్యాల కృష్ణమరాయడు 1597-8లో వేంకటరాయల రాజ్యాధికారమును ధిక్కరించి జంబులమడుగు యుద్ధమునందు ఓడిపోయినట్లు ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారి చరిత్ర గ్రంధనము[62]. సిద్ధవట శాసనమునందు మట్ల అనంతభూపాలుడు "జంబ్బుల మడక భూసంగ్రామ జయశాలి" అని కూడ కలదు

కనుక నంద్యాల కృష్ణమరాజు చరమకాలము స్థూలముగ 1600 ప్రాంతము. నంద్యాల నారపరాజు చరమకాలము స్థూలముగ 1550 ప్రాంతము కాగలవు. నారపరాజు తాత. కృష్ణమరాజు మనుమడు కావున కృష్ణమరాజు ప్రాభవకాలము 1560-1600 కాగలదు. కనుక రాఘవ పాండవీయము రచనాకాలము 1550 ప్రాంతము, కళాపూర్ణోదయము రచనా కాలము 1565 కావలయును. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నము కళా పూర్ణోదయము తరువాతి గ్రంధము. కనుక ప్రభావతీ ప్రద్యుమ్నము రచనాకాలము 1570 ప్రాంతము కావలయును. పింగళి సూరన చరమకాలము 1575 ప్రాంతము కావచ్చును. జనన కాలము 1500 ప్రాంతమగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవ కాలాంతమునాటికి (1524) పింగళి సూరన సుమారు పాతికేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మరి అసంభవము. కనుక పింగళి సూరన సహితము అష్టదిగ్గజకవులలో ఒకడుకాడు.

భట్టుమూర్తి :

భట్టుమూర్తి వసుచరిత్ర రచనాకాలము 1570 - 72 సంవత్సరముల మధ్యకాలమని, స్థూలముగ 1571వ సంవత్సర మని పూర్వోక్తము భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము తత్పూర్వ గ్రంథము. అది అళియ రామరాయల మేనల్లుడు నరసరాజునకు అంకితము. (74, 75, 89, 91ప. 1ఆ.) కనుక నరస భూపాలీయము. రచనాకాలము స్థూలముగ 1560ప్రాంతము కావచ్చును. వసుచరిత్ర తర్వాతి గ్రంథము హరిశ్చంద్ర నలోపాఖ్యానము. అది రఘురామునకు అంకితము. రచనాకాలము స్థూలముగ 1575 ప్రాంతము కావచ్చును. కనుక భట్టుమూర్తి చరమకాలము 1580 ప్రాంతము కావలయును జనన కాలము 1500 ప్రాంతమగును కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవ కాలాంతమునాటికి (1524) భట్టుమూర్తి సుమారు పాతికేండ్ల వాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే నుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱి అసంభవము కనుక భట్టుమూర్తి నైతము అష్టదిగ్గజ కవులలో ఒకడు కాడు.

కందుకూరి రుద్రయ :

మఱి కందుకూరి రుద్రకవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1913వ సంవత్సరమునందు ప్రకటించిన సమాచారమునందు ఇట్లు కలదు.[63]

రుద్రకవి కోపించి రాజుమీఁదఁ జెప్పిన పద్యములట:- తిట్టుదునా.............ఈ విధముగ సింహావలోకనముగా మూడు పద్యములను బలికెనట! రాయలు భయ భ్రాంతుఁడై మీ సామర్థ్యము మాకుఁ దెలియదాయెనని స్తుతియించెను. పిమ్మట నీశాన్య సింహాసనారూఢుని గావించెను.......ఇబ్రహీం పాదుషా క్రీ. శ. 1478 రుద్రకవి కిచ్చిన గ్రామము నేఁటికి ననుభూయమానముగ నున్నది. కాన యిబ్రహీం కాలమున రుద్రకవి యుండుట సునిశ్చితము నిరంకుశోపాఖ్యానకర్త యీతఁడు కాదగును. వేశ్యావర్ణనమున నా గ్రంథమందు సీసపాద మొకటి యిట్లున్నది. "చేరి కన్నతభూమి చెఱవట్టు పాశ్చాత్య నృపతికైన నొకింత కృప తలిర్ప"— ఇట్లుండుటఁబట్టి యీ గ్రంథము విద్యానగర వినాశానంతరము రచింపఁబడినది కాదగు ననఁదగును ఈతఁడే బాలుఁడుగాఁ గృష్ణరాయల నాఁటఁగూడ నున్నాఁడేమో!—"

ఇందు "క్రీ శ. 1478" ప్రమాదపతితము అది క్రీ.శ. 1558 శాసనములోని జయనామ సంవత్సరము 1558వ సంవత్సరమే.[64]

ప్రభాకరశాస్త్రిగారే 1939వ సంవత్సరమునందు ప్రకటించిన ఇదే సమాచారమునందు ఇంతను ఇట్లు కలదు.[65]

"—అది విద్యానగరమును దురుష్కులు కొల్లగొట్టిన దుస్సందర్భమును దెలుపుచున్నది విద్యానగర వినాశము క్రీ శ. 1568నాఁడు జరిఁగినది. కావున నిరంకుశోపాఖ్యాన రచన మటుతర్వాత జరిగినదగును ...నిరంకుశోపాఖ్యాన, సుగ్రీవ విజయకర్త క్రీ శ. 1568 ప్రాంతముల వాఁడేని కొంత తర్వాతి వాఁడేని కాఁగలఁడు."

ఇది "గమనింపదగినది" అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారి అభిప్రాయము[66] కనుక నిరంకుశోపాఖ్యానము రచనాకాలము స్థూలముగ 1570 ప్రాంతము కావలయును. నిరంకుశోపాఖ్యానమునందు ఇట్లు కలదు.

"అని ముని ధర్మశీల వసుధాధిపమౌళికి నేర్పుమించి చె
ప్పిన కథ బాల్యచాపలము పెంపున స్వామికి విన్నవించితిన్
జనకుఁడు బాలుఁడాడు నవశబ్ద వచోవివహంబుచేత నె
మ్మనమున మోదమందు క్రియ మామకవాక్కుల సంతసిల్లుమా"
134ప. 4ఆ.

- ఇది యథార్థమైనచో, కందుకూరి రుద్రకవి జననకాలము 1570 - 25=1545 ప్రాంతమగును కథార్థమైనచో తత్పూర్వము కావచ్చును. 1558వ సంవత్సరమునందు రెంటచింతల అగ్రహారము నందిన కందుకూరి రుద్రకవి జననకాలము తత్పూర్వ మగుటయే తథ్యము. అంతేకాదు రాష్ట్రౌఢవంశ మహాకావ్యము నందు ఇట్లు కలదు[67].

"శ్రీమద్వాగుల భూమిపాల తిలక శ్రీ శాహనారాయణ
స్ఫూర్జత్కీర్తి చరిత్ర చిత్రితపదే రాష్ట్రౌఢ వంశాభిధే
భవ్యే స్కందపురాన్వయేన కవినా రుద్రేణ సృష్టే మహా
కావ్యేఽస్మిన్ కృతిపైరి వీరవిజయః సర్గస్తు వింశోఽగమత్"

ఇందలి స్కందపుర రుద్రకవి కందుకూరి రుద్రకవిగ, రాష్ట్రౌఢ మహాకావ్యము కందుకూరి రుద్రకవి కృతిగ స్వర్గ సుబ్రహ్మణ్య కవిగారి పరిగణనము[68] రాష్ట్రౌఢ మహాకావ్యము నందు, అది 1536వ సంవత్సరమునందు రచింపఁబడినట్లు కలదు.[69] కనుక రాష్ట్రౌఢ మహాకావ్యమును రచించిన కందుకూరి

రుద్రకవి జననకాలము 1505 ప్రాంతమే అగును. అయిన, నిరంకుశోపాఖ్యానములోని "బాల్యచాపలము", ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణములోని "కతిపయాక్షర పరిగ్రహజనితంబైన నైసర్గిక చాపలంబు" (12వచ. 1ఆ) మడికి సింగన వాసిష్ఠ రామాయణములోని "కతిపయాక్షరాభ్యాస చాపలంబు" (10వచ. 1ఆ) వంటిదే అగును. అంతేకాదు. నిరంకుశోపాఖ్యానము బాలరచనముగ లేదు. ప్రౌఢరచనముగనే కలదు. అందువలన రుద్రకవి జననకాలము 1505 ప్రాంతమే అగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవ కాలాంతమునాటికి (1524) కందుకూరి రుద్రకవి సుమారు ఇరువదేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజ కవి అగుట మఱి అసంభవమే. కనుక కందుకూరి రుద్రకవి కూడ అష్టదిగ్గజ కవులలో ఒకడు కాడు.

## శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము :

శ్రీకృష్ణదేవరాయల ఏకైక పుత్త్రుడు తిరుమల దేవ రాయలు రాజ్యము చేయుచున్నట్లు, అతని శాసనములు అనేకము 1524వ సంవత్సరమునందు మాత్రమే కలవు. 1524 నుండి 1528 వఱకు తిమ్మరుసు జాడ శాసనములందు కానరాదు. తిరుమల దేవరాయల జననకాలము 1518వ సంవత్సరము. కనుక ఆరేళ్ల కుమారునికి శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేకము చేసెనని, అనతికాలములోనే శ్రీకృష్ణదేవరాయల కుమారుడు విష ప్రయోగము వలన చనిపోయెనని, విషప్రయోగము తిమ్మరుసు వఱకు, తిమ్మరుసు కొడుకు తిమ్మనకు ఆపాదింపఁబడెనని ఫెర్నావో న్యూనిజ్ గ్రంథస్థము చేసిన విషయము "సత్యము" కావచ్చునని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి అభిప్రాయము.[70] అంతే కాదు. 1527, 28 సంవత్సరములందే శ్రీకృష్ణదేవరాయలు అచ్యుతదేవరాయలను వారసునిగ ప్రకటించియుండునని కూడ డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి అభిప్రాయము.[71] ఆ కాలమునందు అచ్యుతదేవరాయల శాసనములు కలవు.[72] కనుక శ్రీకృష్ణదేవరాయల అవసానకాలము 1530వ సంవత్సరమైనను, 1524వ సంవత్సరమునుండి శ్రీకృష్ణదేవరాయల జీవితము తిమిరాంధకార బంధురము. సాహితీ సమరాంగణ సార్వభౌమత్వము గత వైభవము. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము 1509-1524 మధ్యకాలమున మాత్రమే. ఆ కాలమునందలి మహా కవులే అష్టదిగ్గజకవులు.

## కడమ అష్టదిగ్గజకవులు ఎవరు?

అష్టదిగ్గజ కవులనఁబడిన అయ్యలరాజు రామభద్రుడు తెనాలి రామ(లింగ)కృష్ణుడు, పింగళి సూరన, భట్టుమూర్తి కందుకూరి రుద్రకవి పదునారవ శతాబ్ది ద్వితీయ, తృతీయ పాదముల (1526-1575) లోని మహాకవులు. కనుక అష్టదిగ్గజ కవులు కారు కాలేరు నంది తిమ్మన, అల్లసాని పెద్దన మాదయగారి మల్లన, ధూర్జటి పదునారవ శతాబ్ది ప్రథమ పాదమ (1501-1525)లోని మహాకవులు. కనుక అష్టదిగ్గజ కవుల అయిన, కడమ అష్టదిగ్గజకవులు ఎవరు?

## కృష్ణ రాయభూషణుడు :

భట్టుమూర్తికి రామరాజభూషణ బిరుదనామము కలదు వసుచరిత్ర ఆశ్వాసాంత గద్యను "సాహిత్యరసపోషణ రామరాజ భూషణ ప్రణీతం"బైన అనియే కలదు. అనగా రామరాజ ఆస్థానమునకు ఆభరణమువంటివాడని అర్థము. రామరాజు ఆస్థానము నందు ప్రముఖకవి అని తాత్పర్యము. రామరాజన శ్రీకృష్ణదేవ రాయల అల్లుడైన అళియరామరాయలు. అళియరామరాయల సోదరుడు తిరుమల రాయలకు వసుచరిత్ర అంకిత మిచ్చినను, అంతకుపూర్వము భట్టుమూర్తి అళియరామరాయల ఆస్థానము నందు ప్రముఖకవి కానిదే, రామరాజభూషణ బిరుదనామము లభింపదు. కనుక భట్టుమూర్తి అళియరామరాయల ఆస్థానము నందును ప్రముఖకవి. ఇది సర్వసమ్మతము. మఱి భట్టుమూర్తి తండ్రికి వేంకటరాయభూషణ బిరుదనామమే కలదు. ఇది భట్టు మూర్తియే తెలిపిన సంగతి.

> "—అమిత యమకాశ్వధాటీ ప్రబంధాంకసింగ
> రాజసుత తిమ్మరాజ పుత్త్ర ప్రసిద్ధ
> సరస వేంకట రాయభూషణ సుపుత్త్రి
> నను బుధవిధేయు శుభమూర్తి నామధేయు." 13ప. 1ఆ.

ఇట్లు కావ్యాలంకార సంగ్రహమునందు కలదు. ఇందు ప్రబంధాంకము సింగరాజు కొడుకు తిమ్మరాజు అని, తిమ్మరాజు కొడుకు ప్రసిద్ధుడైన వేంకటరాయ భూషణుడని, వేంకటరాయ భూషణుని కొడుకు భట్టుమూర్తి అని కలదు వేంకటరాయ భూషణునకు నామధేయము లేదు. బిరుదనామమే కలదు. అనగా అతడు బిరుదనామ ప్రసిద్ధుడని అవగాహనమగును. వేంకటరాయ భూషణుడు వేంకటరాయల ఆస్థానమునందు ప్రముఖకవి కానిదే, వేంకటరాయభూషణ బిరుదనామము కలుగదు. వేంకటరాయలు అచ్యుతదేవరాయల తనయుడు. అళియరామరాయలకు పూర్వము

పరిపాలకుఁడు. ఇట్లు అచ్యుతరాయభూషణ బిరుదనామ ప్రసిద్ధుడును ఉండవచ్చును. ఉన్నట్లు ప్రమాణము లేదు. కాని, కృష్ణరాయభూషణ బిరుదనామ ప్రసిద్ధుడు కలడు.

"సకల సత్కవి పూజ్య సుకవిత్వ సామ్రాజ్య
నిర్వాహకుఁడు పెద్ద పర్వతన్న
వివిధభాషావార్య వివేచనా చాతుర్య
సర్వంకషుఁడు బోడి పర్వతన్న
వర పద్యదాకార వాచా చమత్కార
నిరుపమ మతిశాలి తిరుమలన్న
యవధానకృతిగర్వ కవితోచ్చ సందర్భ
కీర్తి తత్ప్రజ్ఞుండు కేశవన్న

దనకు నన్నలు గాఁగఁ దనరు కృష్ణ
రాయభూషణకుల రామరాజ తనయ
కేశవాత్మజ పర్వతాధీశు వేంక
టాద్రి విదె కావ్యమేనిత్తు నంకితముగ."

ఇట్లు పైడిమఱ్ఱి వేంకటపతి చంద్రాంగద చరిత్ర అవతారికయందు కలదు. ఇందు వేంకటపతి తండ్రి పర్వతరాజు, తాత కేశవరాజు, ముత్తాత రామరాజు, మూలపురుషుడు కృష్ణరాయభూషణుడు అని కలదు. వేంకటరాయభూషణునికి నామధేయము లేనట్లే కృష్ణరాయభూషణునికిని నామధేయము లేదు. బిరుదనామమే కలదు. అనగా ఇతడును బిరుదనామ ప్రసిద్ధుడని అవగాహనమగును. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు ప్రముఖకవి కానిదే, కృష్ణరాయభూషణ బిరుదనామము కలుగదు. అంతేకాదు. అతడు కృష్ణరాయభూషణ బిరుదనామ ప్రసిద్ధుడు కానిదే, పైడిమఱ్ఱి వేంకటపతి వంశము కృష్ణరాయభూషణ కులము కాదు. పైడిమఱ్ఱి వేంకటపతి చంద్రాంగద చరిత్ర శ్రీరామచంద్రునికి అంకితము. "అప్పకవి యీ చంద్రాంగద చరిత్రములోని పద్యముల నుదాహరించి యుండకపోవుటచేత నీ కవి 1650వ సంవత్సరమునకుఁ దరువాతివాఁడని యూహింపఁ దగియున్నాఁడు. అందుచేతఁ గవి 1700 సంవత్సర ప్రాంతముల యందున్నవాఁడని తోఁచుచున్నది." అని కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయము.[73] "ఇతని కవిత్వమున ఆముక్తమాల్యద, మనుచరిత్రముల కనుకరణములు బాగుగా గన్పట్టుచున్నవి. అందుచే నీకవి పదునాఱవ శతాబ్దికిఁ బూర్వపువాఁడు కాఁడనియుఁ బదునేడవ శతాబ్దియందున్న వాఁడనియుఁ దలంపవచ్చును." అని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[74] ఇది వీరేశలింగముగారి అభిప్రాయమునకు ఇంచుమించు సంవదించునదియే. వేంకటపతి కాలము స్థూలముగ 1700 ప్రాంతము కావున, అతని ముత్తాత రామరాజు కాలము స్థూలముగ 1600 ప్రాంతమగును. తన్మూల పురుషుడు కృష్ణరాయభూషణుని కాలము శ్రీకృష్ణదేవరాయల కాలమగును. కనుక కృష్ణరాయభూషణుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు ప్రముఖకవి అగును. అంతేకాదు రామరాజభూషణ, వేంకటరాయభూషణ బిరుద నామములకు కృష్ణరాయభూషణ బిరుదనామమే ఆదర్శమగును. శ్రీకృష్ణదేవరాయలే అట్టి బిరుదనామమును పొందుకొల్పుట, అది అచ్యుతదేవరాయలు, వేంకటరాయలు, అళియ రామరాయలు అనుసరించుట సుసంగతమగును. అట్టి కృష్ణరాయభూషణుడు అష్టదిగ్గజ కవులలో ఒకడగుట విధాయకము. అపరిహార్యము. కనుక కృష్ణరాయభూషణుడు అష్టదిగ్గజ కవులలో ఒకడు.

నందితిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి, కృష్ణరాయభూషణుడు అష్టదిగ్గజకవులు. అయిదుగురును ఆంధ్రకవులు. అష్టదిగ్గజకవులు ఆంధ్రకవులే కావలసిన ఆవశ్యకము లేదు "—అష్టదిగ్గజము లాంధ్రకవులే యని తలంపరాదనియు, నాతని యాస్థానమున సంస్కృత కర్ణాటక కవులు కూడ నుండురనియు, వారినిగూడ రాయలు సమాన గౌరవముతోఁ జూచెననియుఁ దలంపవలసియున్నది." అని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[75] ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి పారప్రవచనము ఇది సర్వసమ్మతము కావలసిన సదభిప్రాయము.

### సంస్కృతకవి :

శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేక మహోత్సవము విశ్వనాథ స్థానాపతి రాయవాచకమునందు అభివర్ణింపఁబడినది, అందిట్లు కలదు.

"—నగరి విద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు
అష్టభాషా కవిత కృష్ణావధానులు శాబ్దికం పాండిత్యం
వెంకటరామశాస్త్రుర్లు సహస్రావధాని ప్రభాకరశాస్త్రుర్లు
జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్నపెద్దలు
అందరున్ను శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి
మంగళస్నానం శేయించి—"

ఇందు "కృష్ణరాయలవారికి మంగళస్నానము చేయించి"నవారు అతిముఖ్యులు కాని అముఖ్యులు కారు వారిలో "అష్టభాషా కవిత కృష్ణావధానులు" ఒకడు. అనగా కృష్ణావధానులు అష్ట

భాషా కవితావిశారదుడని అర్థము. సంస్కృతము, ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అపభ్రంశము, ఆంధ్రము-అష్టభాషలు[76] కనుక కృష్ణావధానులు సంస్కృత కవితా విశారదుడు. ఆంధ్రకవితా విశారదుడు కూడ పై వర్ణన పంక్తిలోని "నగర విద్వాంసులు" మొదలు "కవీశ్వరులు" వఱకు అందఱును పరంపరాగతులు. శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకమునకు పూర్వము, అతని అన్న వీరనరసింహ రాయలు (1503-1509), తండ్రి ఈశ్వర నరస నాయకుడు (1492-1503) పరిపాలకులు వారి కాలమునుండి, కనీసము 1501వ సంవత్సరమునుండి కృష్ణావధానులు ఆస్థానకవి కావచ్చును. 1509వ సంవత్సరమునుండి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి అగును. అనంతరము అష్టదిగ్గజకవి అగును. కనుక "అష్టభాషా కవిత కృష్ణావధానులు" అష్టదిగ్గజ కవులలో ఒకడు. అతడు సంస్కృతకవి.

కన్నడ కవులు :

ఆచార్య కె ఎ. నీలకంఠశాస్త్రిగారి చరిత్ర గ్రంథము నందు ఇట్లు కలదు.[77] ఇంగ్లీషునకు తెనుగుసేత—

"కృష్ణదేవరాయల కాలమునుండి మాత్రమే వైష్ణవోద్యమము కన్నడ సాహిత్యముమీద ప్రబలమైన ప్రభావము నెఱపినది ఈ నూతన వైష్ణవ సాహిత్యము సంస్కృత మహాకావ్యముల అనువాద రూపమున కలదు. అంతేకాదు. అది కన్నడభాష హొళగన్నడమునుండి హొసగన్నడమునకు మాఱుటను సూచించును. మహాభారతములోని తొలి పది పర్వములను కుమార వ్యాస బిరుదాంకితుడు, రెండవ దేవరాయల కాలములోని చామరస కవికి ప్రత్యర్థి, బ్రాహ్మణకవి అయిన నారణప్ప అనువదించెను. అది గదగులోని దేవతకు అంకితము. అందువలన "గదుగిన భారత" అని ప్రసిద్ధమైనది. మిగిలిన పర్వములను 1510లో తిమ్మణ్ణ అనువదించి, తన పోషకుని పేర "కృష్ణరాయ భారత" అని పేరు పెట్టెను....భాగవతము కృష్ణదేవరాయలయొద్ద, అచ్యుత దేవరాయలయొద్ద వర్తిల్లిన చాటు విట్ఠలనాథునిచే అనువదింపఁబడెను. అతడు కుమార వ్యాసుడు మిక్కిలి సంగ్రహముగ అనువదించిన మహాభారతములోని భాగములను - పౌలోమ, ఆస్తిక పర్వములను — (ఉప పర్వములు) మఱల విపులముగ రచించెను. ఇది కన్నడ సాహిత్యమునకు మాత్రమేగాక, సంస్కృతాంధ్ర తమిళ సాహిత్యములకును మహాయుగము."

ఇందలి తిమ్మణ్ణకు "కర్ణాటకవికుల సార్వభౌమ" బిరుదము కలదు.[78] అతడు "కృష్ణదేవరాయల ఆస్థానమునందుండి అతని ఇష్టానుసారమే కుమార వ్యాసభారతమునకు ఉత్తర భాగముగ ఎనిమిది (ఏడు?) పర్వములను రచించెను.[79] చాటు లేక చారువిట్ఠలనాథుని ద్వాదశ స్కంధాంతమునందు అచ్యుత, కృష్ణరాయ ప్రసక్తి కలదు.[80] ఇద్దఱును శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవులు. అష్టదిగ్గజకవులును అగుదురు కనుక కర్ణాట కవికుల సార్వభౌముడు, కృష్ణరాయ భారతకర్త తిమ్మణ్ణ; కృష్ణరాయ ప్రసక్తికల కన్నడ భాగవతకర్త చాటువిట్ఠలనాథుడు అష్టదిగ్గజ కవులలో ఇద్దఱు ఇద్దఱును కన్నడకవులు

తిమ్మణ్ణ, చాటువిట్ఠలనాథుల గ్రంథములందు అష్టదిగ్గజ కవులని లేకపోవుట బాధకము కాదు నందితిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి గ్రంథములందును అష్ట దిగ్గజ కవులని లేదు. అంతేకాదు. రాయవాచకమునందును నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన అష్ట దిగ్గజ కవులని లేదు. కృష్ణరాయ విజయమునందును ధూర్జటి అష్టదిగ్గజకవి అని లేదు. కనుక తిమ్మణ్ణ, చాటువిట్ఠలనాథుడు అష్టదిగ్గజ కవులగుట సాధకము.

కర్ణాటకవికుల సార్వభౌముడు, కృష్ణరాయ భారత కృతి కర్త అయిన తిమ్మణ్ణ శ్రీకృష్ణదేవరాయల కీర్తిని, ప్రతాపమును వర్ణించిన కన్నడ పద్యములివి:[81]

"శివను నారీకవచ శీత్రి దవను పన్నగరాజ శరద
భువనదీ కళ్మణి సలదు జీవనవ బిట్టిహదు
నవని నగధారిసుతలత్యు త్సవది నరసయ కృష్ణరాయన
ధవళకీర్తి సుధాంశు గర్విసు తిర్పుద నవరత."

"హతివన తెయది బిళగలాపుది నళిన మిత్రన తేజవవిలను
నుఱిదు హచ్చినదిద్దూడుంటే వహ్నియాటోప
తిళియ కాననహొమియాగు చ్ఛళిపి నరసయ కృష్ణరాయన
లలితభుజ తేజః కృశానుప్రభె విజృంభిసితు."

చాటు విట్ఠలనాథుని కన్నడ భాగవతములోని పద్యములివి:[82]

"సదమళాచ్యుత కృష్ణరాయన హృదయవెనిసువ భాగవతశా
స్త్రద మహాసత్కీర్తి లక్ష్మియ విజయమందిరవ
కుదియ కలశస్థాన వెనలొప్పిదను వాలిసుకూలిదు కన్నయ
పదవి కూలుమయాళచ్యుతారణ్యాఖ్య యతిరాయ"

"నిరుపమాచ్యుత కృష్ణరాయన పరమతేజః పుంజవిచీ
కరిని, గురురూపాగి భాగవతాంతరంగవను
ధరిగి కన్నడవాగి తిగిద్దుద్ధరిసి కడిగాణిసిదనత్యా
శ్చరియవివలు సదాద్భుతారణ్యాఖ్య యతిరాయ."

చాటువిట్టలనాథుని గురించి ఆర్. నరసింహాచార్యగారి అభిప్రాయమిది.[33]

"ఈ కవి విజయనగరద(విజయమంద్ర) కృష్ణరాయ (1509-1529), అచ్యుతరాయ (1530-42) ఇవరుగళ కాలదల్లి భాగవతవన్ను బరిదిరబహుదు. ఎందు ఊహిసలు అవకాశవిది. ఈ ఊహ్యాయప్రకార కవియ కాలవు సుమారు 1530 ఆగబహుదు"

ఇందు చాటువిట్ఠలనాథుడు శ్రీకృష్ణదేవరాయల (150 - 1529) అచ్యుతదేవరాయల (1530-42) కాలములందు విజయ నగరమునందు కలడని, అతని కాలము సుమారు 1530 ప్రాంత మని కలదు. ఇది తదనంతర కర్ణాట సాహిత్య చరిత్రకారులెల్ల అనుసరించినది.

కృష్ణరాయభూషణుని స్థానము రామరాజభూషణునికి, సంస్కృత కర్ణాట కవుల స్థానము అనంతరకాలికులైన ఆంధ్ర కవులకు కాలాంతర సంక్రాంతము కావచ్చును. సమకాలిక చారిత్రిక సమాచారమును కాదని, అర్వాచీన జనశ్రుతి సమా చారమును అనుసరించుట అంధవిశ్వాసము.

మొత్తముమీద నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి, కృష్ణరాయభూషణుడు, కృష్ణావ ధానులు, తిమ్మణ్ణ, చాటువిట్ఠలనాథుడు అష్టదిగ్గజ కవులు. ఒక సంస్కృతకవి, ఇద్దఱు కర్ణాటక కవులు, అయిదుగురు ఆంధ్ర కవులు.

మఱి నవరత్నకవుల మాట?

**తమిళకవి :**

ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారి చరిత్ర గ్రంథము నందే ఇట్లు కలదు.[34] ఇంగ్లీషునకు తెనుగుసేత—

"హరిదాసు అను వైష్ణవకవి సుప్రసిద్ధుడైన విజయనగర సామ్రాజ్యాధిపతి కృష్ణదేవరాయల ఆస్థానమును అలంకరించెను. శైవ, వైష్ణవ సమయములు రెండును వివరించు ఇరు సమయ విళక్కమ్ అను గ్రంథమును వైష్ణవముమీద మొగ్గుతో రచించెను—

మంగళపురుష అను జైనకవి ప్రచుర ప్రచారము కల నిగండు చూడామణి (నిఘంటు చూడామణి) బహుశః కృష్ణరాయల కాలమునందు సంఘటించెను. అందు కృష్ణ రాయల పేరు ప్రముఖముగ కలదు. అతడు రాష్ట్రకూట రాజుగాని, సుప్రసిద్ధుడైన విజయనగర రాజుగాని అగును."

ఇందు హరిదాసు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి అని ఇదమిత్థముగ కలదు. నిఘంటు చూడామణియందు "దాతృత్వము అనగా కృష్ణదేవరాయలు ఇచ్చునది" అని కలదని, తమిళనాడు లోని రాజపాళయం తెలుగు విద్యాలయం అధ్యక్షులు, బహుభాషా సాహిత్యవేత్తలు, ప్రవాసాంధ్రులు ముదునూరు జగన్నాథరాజు గారు ముఖతః తెలిపిన సంగతి (26-8-1988) మంగళపురుష శ్రీకృష్ణదేవరాయల దాతృత్వమును స్వయముగ ఎఱిగిన నిఘంటు కారుడు కావచ్చును. హరిదాసు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి. అతడు, అష్టదిగ్గజ కవులు కలిసి నవరత్నకవులు అగుదురు. అనగా శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు మొదట నవరత్న కవులు ఉండి, అనంతరము తమిళకవి అభావమున అష్టదిగ్గజ కవులు అవతరించియుందురని అవగాహనమగును. నందితిమ్మన పారిజాతాపహరణములోని "భువన విజయాఖ్య సంసన్నవ రత్న" ప్రసక్తి వాచ్యార్థమాత్ర ప్రయోజనిని, అల్లసాని పెద్దన మనుచరిత్రములోని "విద్యాఖేలనభోజ" సంబుద్ధి శ్లాఘార్థమాత్ర ప్రయోజని కాదు. అంతేకాదు. తమిళకవి అభావము చరిత్రకు అనుకూలము.

శ్రీకృష్ణదేవరాయలు ఒరియారాజు కూతురును వివాహ మాడిన అనంతరము, మహాసైన్యముతో ఏబది సంవత్సరముల నుండి కప్పము చెల్లింపకుండ తిరుగుబాటు చేసిన సామంతరాజు నేలపైన చోళమండలములోని కాటూరు నగరమును ముట్టడించెను. నగరమును పరివేష్టించియున్న నది వఱద నీటితో నిండియుండగా, గట్టులు తెగగొట్టించి, వఱద నీటిని పైదొలగించి, కోటలో ప్రవేశించి, ఎదుర్కొన్న లక్ష కాల్బలమును సహస్రాశ్వదళమును హతమార్చెను. అసంఖ్యాక రత్నములు, గజాశ్వములు గాక, కోటి ఆరు లక్షల బంగారు నాణెములను కైవసము చేసికొని తన సైన్యమునకు పంచి పెట్టివైచెను సామంతరాజును బందీగ్రాహముగా విజయ నగరము తీసికొనివచ్చి కారాగారమున బంధించెను. అతడు కారాగారమునందే మరణించెను." అని ఫెర్నో న్యూనిజ్ గ్రంథస్థము చేసెను.[85] కాటూరు కటకమే అని హొసకోట కృష్ణశాస్త్రిగారి, సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి; ఉమ్మత్తూరు అని డాక్టర్ యస్. కృష్ణస్వామి అయ్యంగారి; కాయత్తార్ అని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి అభిప్రాయములు.[86] కేతవరమని డాక్టర్ శ్రీమతి భార్గవి శివయ్యగారి అభిప్రాయము.[87]

చెంగల్పట్టు జిల్లా పొన్నేరి తాలూకాలోని కాటూరు అని ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారి, ఆచార్య టి. వి. మహాలింగముగారి అభిప్రాయము.[88] ఈ కాటూరు "చోళమండల తీరదేశమునందున్నది. మఱియు దక్షిణ పరిసరముల నొక యేఱు ప్రవహించుచున్నది. కాని యా ప్రాంతము నేలుచుండిన ప్రభువు కృష్ణరాయల దండయాత్రకు మునుపేబది సంవత్సరములనుండి తిరుగుబాటు చేసియుండెననుట విశ్వసింపదగనిది." అని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి ప్రత్యభిప్రాయము [89]. ఆ ప్రాంతమనే కాదు; ఏ ప్రాంతమును ఏలుచుండిన ప్రభువైనను శ్రీకృష్ణదేవరాయల దండయాత్రకు పూర్వము ఏబది సంవత్సరములనుండి తిరుగుబాటు చేసియుండెననుట విశ్వసింపదగని విషయమే. న్యూనిజ్ గ్రంథము సత్యాసత్య సమ్మిశ్రితము. ఏబది సంఖ్య సత్యము కాకపోవచ్చును. ఏ పది సంఖ్యయో, అయిదు సంఖ్యయో సత్యము కావచ్చును. కటకము, ఉమ్మత్తూరు, కేతవరము కటక దండయాత్రకు పూర్వమే శ్రీకృష్ణదేవరాయలకు స్వాధీనమైనవి. కటక దండయాత్ర అనంతరము స్వాధీనమైన కాటూరు, కాయత్తార్ అగుటకంటె కాటూరు అగుటయే సుసంగతము. అది నేడు కుగ్రామమైనను నాడు మహాగ్రామమగును. అదే నగరము. అది చోళమండలమునందు అనగా తమిళ దేశమునందు కలదు. న్యూనిజ్ గ్రంథనములోని శ్రీకృష్ణదేవరాయల కాటూరు దండయాత్ర సర్వచరిత్రకారులకును సమ్మతము. దండయాత్రాకాలమునందును శ్రీకృష్ణదేవరాయలు కవి పండిత పరివేష్టితుడు. ఇందుకు శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని అవతారికయే (11, 18పద్య. 1ఆ.) ప్రబల సాక్ష్యము. కాటూరు దండయాత్రా కాలమునందు శ్రీకృష్ణదేవరాయలతోపాటు తమిళకవి విజయనగరమునుండి తరలివచ్చుట తప్పనిసరి తన్నెంత ఆదరించినను, శ్రీకృష్ణదేవరాయల కాటూరు విధ్వంసనము, తమిళ దేశాక్రమణము తమిళకవికి మనస్తాపము కలిగించుట సహజము. కనుక తమిళకవి విజయనగరము తిరిగి వెళ్లకపోవుట అంతకంటె సహజము. ఇది తమిళ కవి అభావమునకు చరిత్ర అనుకూలత. అభావము-ప్రధ్వంసాభావముగాని, ప్రాగభావము కాదు. కనుక శ్రీకృష్ణదేవరాయల కాటూరు దండయాత్రకు పూర్వము, తమిళకవి హరిదాసు శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి కావలయును.

నవరత్నకవుల కాలము :

"భువన విజయాఖ్య సంసన్నవరత్న" ప్రసక్తి నంది తిమ్మన పారిజాతాపహరణమునందు, శ్రీకృష్ణదేవరాయలకు "విద్యాకేళనభోజ" సంబుద్ధి అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు, అష్టదిగ్గజ కవీశ్వరుల ప్రసక్తి 1527వ సంవత్సరము నాటి తిప్పలూరు శాసనమునందు కలవని పూర్వోక్తము.

భువన విజయభవనమును, శ్రీకృష్ణదేవరాయల కాలమునందే విజయదశమినాడు(12-9-1520) కనులారగాంచి, మనసార వివరించిన డొమింగోస్ పీయస్, అది శ్రీకృష్ణదేవరాయలు గజపతితోడి యుద్ధమునుండి తిరిగివచ్చి, విజయచిహ్నముగ కట్టించినట్లు గ్రంథస్థము చేసెను.[90] కటక విజయముకంటె, కొండవీటి విజయము గొప్ప విజయము. ప్రతాపరుద్ర గజపతి కొడుకు వీరభద్ర గజపతిని జీవగ్రాహముగాను, ప్రతాపరుద్ర గజపతి రాణిని బందీగ్రాహముగాను తీసికొని శ్రీకృష్ణదేవరాయలు విజయనగరమునకు విజయం చేసినది. అది 1514వ సంవత్సరమునందు జరిగినది.[91] కనుక భువన విజయభవన నిర్మాణ కాలము 1515 సంవత్సరము కావలయును.

నంది తిమ్మన పారిజాతాపహరణమునందు శ్రీకృష్ణదేవరాయలు శ్రీరంగము, చోళదేశము, కావేరీ తీరము(18ప. 1ఆ), ఉమ్మత్తూరు, శివసముద్రము (104ప. 2ఆ) కొండవీడు (21-23ప. 1ఆ.) ఉదయగిరి, వినుకొండ, బెల్లముకొండ,

దేవరకొండ, జల్లిపల్లె, అనంతగిరి, కంబముమెట్టు (23ప. 1అ; 60ప. 3అ.) కళింగము (60ప. 3అ) జయించినట్లు కలదు. కటకము జయించినట్లు లేదు. కాని శ్రీకృష్ణదేవరాయలకు "కటకేశ సింధుమందరా!" అను సంబుద్ధి కలదు. (93ప.4అ) అనగా కటకాధిపతి అను సముద్రమునకు మందర పర్వతము వంటివాడని అర్థము. ఉదయగిరి మొదలు తీరాంధ్రము, కళింగాంధ్రము శ్రీకృష్ణదేవరాయలకు పూర్వము కటకాధిపతి రాజ్యమే. అది జయించిన శ్రీకృష్ణదేవరాయలు కటకేశసింధు మందరుడే అగును. కనుక ఉత్కళ దేశములోని కటకమును జయించినట్లు కాదు. పారిజాతాపహరణమునందు జయించినట్లే కలదు.

> "బలనికాయము కాలి మట్టులనె యడంచుc
> గటకమును నింక ననుచు నుత్కల మహీశుc
> డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతcడు
> రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుcడు" 23ప 1అ.

ఇప్పటికి తీరాంధ్రము, కళింగాంధ్రము కైవసము చేసి కొన్నది చాలక, ఇంకను శ్రీకృష్ణదేవరాయలు ఉత్కళదేశమును కబళించుటకు గూడ దండయాత్ర సాగించునని ప్రతాపరుద్ర గజపతి ప్రతిదినము భయపడుచున్నాడని తాత్పర్యము. శ్రీకృష్ణదేవరాయల కటక దండయాత్ర 1517వ సంవత్సరమునందు సాగినది. "శా.శ. 1438 ధాతు ఫాల్గుణ శు(బ?)5 బుధవారము నాటికే రాయరాణువ కటకము వఱకు కూచి చేసియుండెనని తిప్పరుసయ్య కుమారుడు లక్ష్మీకాంతరుసయ్య వ్రాయించిన కొమ్మూరు శాసనమునందు కలదు.[92] రాయరాణువ అనగా శ్రీకృష్ణదేవరాయల సైన్యము. కూచి అనగా దండయాత్ర. అది ధాతునామ సంవత్సర ఫాల్గుణమాసము నాటికి(25-2-1917) జరిగినది. కనుక పారిజాతాపహరణము రచనాకాలము తత్పూర్వము కావలయును. పారిజాతాపహరణమునందే శ్రీకృష్ణదేవరాయలకు,

> "ప్రతివర్ష వసంతోత్సవ
> కుతుకాగత సుకవినికర గుంఫితకావ్య
> స్మృతి రోమాంచ విశంకిత
> చతురాంతః పురవధూప్రసాధనరసికా!" 139ప.1అ.

అని సమాసైక పద్యసంబుద్ధి కలదు. అందువలన పారిజాతాపహరణము రచనాకాలము యువనామ సంవత్సర చైత్రమాస వసంతోత్సవ సమయము కావచ్చును. కనుక పారిజాతాపహరణము రచనాకాలము 1516వ సంవత్సరము కావలయును

అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు శ్రీకృష్ణదేవరాయలు "కటకపురిc గాచ్చె గజరాజు గలcగి వఱవ" అని కలదు. (37ప 1అ) "కాచ్చెను" అను క్రియకు పద్యమునందు కర్త "కృష్ణరాయ బాహుప్రతాప మాగ్రగన్మహాగ్ని." రూపకము. కనుక అక్షరాల కాచ్చెనని అర్థముకాదు. గెలిచెనని తాత్పర్యము. "వఱవన్=పరుగెత్తునట్లు" అని టీక. అప్పుడు ప్రతాపరుద్ర "గజపతివారు యేడెనిమిది ఆమడ బొడవు ఉత్తరంగా పారిపోయిరి " అని రాయవాచకమునందు కలదు. శ్రీకృష్ణదేవరాయల కటక విజయము ప్రసక్తమైన మనుచరిత్రము రచనాకాలము ధాతునామ సంవత్సరముకాక, ఈశ్వరనామ సంవత్సరమో, బహుధాన్యనామ సంవత్సరమో అగును కనుక మనుచరిత్రము రచనాకాలము స్థూలముగ 1518వ సంవత్సరము కావచ్చును

భువన విజయము నిర్మితమైన కాలము 1515వ సంవత్సరము. "భువన విజయాఖ్య సంసన్నవరత్న" ప్రసక్తి కల నందితిమ్మన పారిజాతాపహరణము రచనాకాలము 1516వ సంవత్సరము శ్రీకృష్ణదేవరాయలకు "విద్యాభేలనభోజ" సంబుద్ధి కల అల్లసాని పెద్దన మనుచరిత్రము రచనాకాలము 1518వ సంవత్సరము. శ్రీకృష్ణదేవరాయలు కాటూరు దండయాత్ర సాగించిన కాలము 1519-20 సంవత్సరము.[93] కనుక శ్రీకృష్ణదేవరాయల భువన విజయమునందు నవరత్నకవులు వెలసిన కాలము 1515-20 సంవత్సరముల మధ్యకాలము.

అష్టదిగ్గజకవుల కాలము :

అష్టదిగ్గజకవుల ప్రసక్తి కల తిప్పలూరు శాసనము కాలము 1527వ సంవత్సరము. తిప్పలూరు శ్రీకృష్ణదేవరాయలు అష్టదిగ్గజ కవులకు ధారవోసి ఇచ్చిన అగ్రహారమని అందు కలదు. అగ్రహార దానశాసనము అనుపలబ్ధము. అయినను శ్రీకృష్ణదేవరాయల ప్రాభవకాలము 1509-1524 సంవత్సరముల మధ్యకాలమని పూర్వోక్తము. కనుక శ్రీకృష్ణదేవరాయల తిప్పలూరు దాన శాసనకాలము 1524వ సంవత్సరముకంటె పూర్వము కావలయును. బహుశః ఏకైకపుత్త్రుడు తిరుమల దేవరాయలకు పట్టాభిషేకము చేసిన 1524వ సంవత్సరమే కావచ్చును. కుమార పట్టాభిషేక శుభసమయమునందు శ్రీకృష్ణదేవరాయలు అష్టదిగ్గజ కవులకు అగ్రహార మొసగుట సంభవము. కనుక శ్రీకృష్ణదేవరాయల భువన విజయమునందు

అష్టదిగ్గజకవులు అలరిన కాలము 1520-24 సంవత్సరముల మధ్యకాలము.

మొత్తముమీద శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు మొదట నవరత్నకవులు కలరని, పిదప అష్టదిగ్గజ కవులు అయిరని; శంకరకవి, అయ్యలరాజు రామభద్రుడు, సకల కథా సార సంగ్రహకర్త రామభద్రుడు, తెనాలి రామ(లింగ)కృష్ణుడు, పింగళి సూరన, భట్టుమూర్తి, కందుకూరి రుద్రకవి అష్టదిగ్గజ కవులు కారని; అష్టదిగ్గజకవులు కేవలము ఆంధ్రకవులే కారని, సంస్కృత కర్ణాటక కవులును అగుదురని; ఆంధ్రకవులు అయిదుగురు నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి, కృష్ణరాయభూషణుడు అని; ఒక సంస్కృత కవి కృష్ణావధానులు అని; ఇద్దఱు కన్నడకవులు తిమ్మణ్ణ, చాటువిఠలనాథుడు అని; నవరత్నకవులు వెలసిన కాలము 1515-20 అని; అష్టదిగ్గజకవులు అలరిన కాలము 1520-24 అని సారాంశము.

## సూచికలు :


1 ఏన్యుయల్ రిపోర్ట్. 282 ఆఫ్ 1937-38
2. కవి జీవితములు ఫిఫ్త్ ఎడిషన్. 1955 పుట 521.
3. అష్టదిగ్గజకవి సమాజములో రాయల నాశ్రయించిన తొలి కవి యెవరు? పుట. 73
4. అదే పుట. 2.
5. అదే. పుట. 70. అధస్సూచిక.
6. అదే. పుట. 77. అధస్సూచిక.
7. అదే. పుట. 79.
8. ఇండియన్ ఎఫిమెరిస్.
9. ది విజయనగర ఎంపైర్. 1977. ఇంట్రడక్షన్. పుట.9.
10. రెండువదె. పుటలు. 476-7.
11. అదే పుట. 477.
12. ఆంధ్ర కవుల చరిత్ర. ద్వితీయభాగము. 1986. పుటలు 167-8
13. ఆంధ్ర కవితరంగిణి. తొమ్మిదవ సంపుటము. పుట.192.
14. అదే. పుట. 196.
15. శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము. 1930. పీఠిక. పుట.8
16. పంద్రెండువదె. పుటలు. 33, 89.
17. ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా ఫోర్త్ ఎడిషన్. 1975. సిక్స్త్ ఇంప్రెషన్. 1984 పుట. 289.
18. పదమూడువదె. పదియవ సంపుటము. పుటలు. 9, 10.
19 అదే. పుటలు. 8-10.
20. అదే. పుట. 10
21 అదే. పుట 12
22. మహమ్మదీయ మహాయుగము. ప్రకరణము. 6. పుట 372.
23. అదే.
24. 1. చాటుపద్య మణిమంజరి. ద్వితీయభాగము. పుట.115;
2. మనుచరిత్ర పీఠిక. గ్రంథవిమర్శనము. వావిళ్ల. పుట. 11
3. తెలుగు మెఱుగులు. పుటలు. 143-5.
25 ఆంధ్రపత్రిక. మన్మథ ఉగాది సంచిక.
26. రామాభ్యుదయ వైభవము. పుటలు. 6-7.
27. అదే. పుట. 7
28 పదునెన్మిదివదె. పుటలు. 10-11.
29. రామాభ్యుదయము. 1967 పీఠిక. పుట. 31.
30. పదునెన్మిదివదె. పుట. 13.
31. ఇరువది తొమ్మిదివదె. పుట. 33.
32 పదునెన్మిదివదె. పుట. 13.
33. ఇరువది తొమ్మిదివదె పుట. 33.
34. పదునెన్మిదివదె. పుట. 13.
35. అదే. పుటలు. 13-15.
36. మానవల్లి కవి-రచనలు. పుటలు. 384-5.
37. అదే. పుట. 385.
38. అదే. పుటలు. 386-7.
39. ఇరువదియారువదె. పుటలు. 28-54.
40. ఉద్భటారాధ్య చరిత్రము. 1926. పీఠిక. పుట. 13.
41 పదమూడువదె ఎనిమిదవ సంపుటము. పుట. 13.
42. వాఙ్మయ వ్యాసమంజరి. పుట. 115.
43. ఉద్భటారాధ్య చరిత్రము. 1974. పీఠిక. పుట. 21.
44. పదమూడువదె. సప్తమ సంపుటము పుట. 245.

45. నలుబదిరెండువసెం. పుటలు. 121_2.

46. అదే. పుట. 123.

47. అదే.

48. అదే. పుటలు. 120_1.

49. అదే. పుట. 120.

50. అదే. పుటలు. 119_20.

51. నలుబదియొక్కటివసెం. పుట. 18.

52. అదే. పుట 21.

53. పాండురంగ మాహాత్మ్యము. 1952. గ్రంథపరిచయము. పుట 11.

54. పదియేడువసెం. పుట. 296.

55. నలుబదిరెండువసెం. పుటలు. 125_6.

56. అదే.

57. పంద్రెండువసెం. పుటలు. 115_7.

58 అదే. పుట. 115.

59. పదునెన్మిదివసెం. పుటలు 104_9.

60. అదే. పుట 108.

61. శాసన పద్యమంజరి. ప్రథమభాగము. పుటలు 108-10.

62. పదియేడువసెం. పుట. 298.

63. ఇరువదినాల్గు 1వసెం. ప్రథమభాగము. పుటలు 25_33.

64. నిరంకుశోపాఖ్యానము 1951. ఉపోద్ఘాతము. పుట 14.

65. సుగ్రీవ విజయము. పీఠిక. పుటలు 15, 16.

66. పంద్రెండువసెం. పుట 241.

67. అరువదినాల్గువసెం. పుట 21.

68. అదే. పుటలు 16, 20_21.

69. అదే. పుట 15.

70. కృష్ణదేవరాయలు. 1972. పుటలు 132_5.

71. అదే. పుటలు. 135_6.

72. లక్ష్మణరాయ వ్యాసావళి. పుటలు. 51_2.

73. పదమూడువసెం. పదకొండవ సంపుటము. పుట 189.

74. అదే. పుట 190.

75. అదే సప్తమ సంపుటము. పుటలు 158-9.

76. సంకేత పదకోశము. పుట. 124.

77. పదియేడువసెం. పుటలు 403_4

78. కన్నడ సాహిత్య చరిత్ర (సుందరం) పుట 132.

79. కన్నడ సాహిత్య చరిత్ర (ముగళి) పుట 166.

80. ఎన్‌సైక్లోపిడియా ఆఫ్ సౌత్ ఇండియన్ కల్చర్. పుట. 63.

81. కర్ణాటక కవిచరితె. ద్వితీయ సంపుటము, పుట 191.

82. అదే పుట 223

83. అదే.

84. పదియేడువసెం. పుటలు 384, 392.

85 తొమ్మిదివసెం. పుటలు 101_2.

86 డెబ్బదివసెం పుటలు 100 - 102.

87. తొమ్మిదివసెం. పుట 100. అథసూచిక 1.

88. అదే. పుట 100.

89. అదే. పుట 101.

90. అదే. పుటలు 44, 29.

91. డెబ్బదివసెం. పుటలు 81_2. అథసూచిక 20.

92. అదే. పుట 87.

93. అదే. పుట 102.

(అయిపోయింది)



# ఇంకొక ముఖం

కన్నడమూలం :

**త. రా. సు.**

తెనిగింపు :

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

నిర్మానుష్యమైన అడవిదారి. ఆ దారిలో ఒక కారు. కారులో అందచందాల రాణియైన అంగన. ఆమెతో ఒక డ్రైవర్.

ప్రొద్దుపోక, మాట్లాడడానికి విషయం దొరకక, నాలుక దురద పెడుతున్న జనులకు, వాదోపవాదాలకు ఇంతకన్న అమోఘమైన, రసవంతమైన విషయం వేరేమి దొరకుతుంది చెప్పండి? దీనిమీద కవితనే కట్టవచ్చు; వేదాంతం మాట్లాడవచ్చు; మనస్తత్వ శాస్త్ర చర్చ చేయవచ్చు; కామశాస్త్రం మాట్లాడవచ్చు. ఈ శాస్త్రప్రపంచం చాలకుంటే, చివరకు తమలోతామే పోట్లాడవచ్చు.

నిజంగా మన ఊహలను సానపెట్టడానికి అంతకన్న అందమైన వస్తువు వేరొకటి లేదని నా అభిప్రాయం. నా అభిప్రాయమేమి? ఆ రోజు అక్కడ గుమిగూడియున్న అందరి అభిప్రాయమూ అదే.

తీర్థహళ్ళికి ఏదో ఉపన్యాసం చేయడానికోసం బయలుదేరిన నేనూ, నా మిత్రుడు అరసూ, ఆ అవకాశాన్ని వినియోగించుకుని జగద్విఖ్యాతమైన ఆగుంబె సూర్యాస్తమయాన్ని అవలోకించడానికి తీర్థహళ్ళి మిత్రుడు విశ్వనాథ్ కారులో ఆగుంబె దిక్కుగా పయనమయ్యాము. మాతోపాటు తీర్థహళ్ళికి చెందిన మరికొందరు మిత్రులున్నారు.

ఏ చింతా లేకుండా కడుపునిండి, తాగడానికి కావలసినన్ని సిగరెట్లు ఉండడంవలన్, మా అందరి నాల్కలకూ ఆ రోజు సంభ్రమం. ఆ ఉత్సాహంలో చాలా వేగంగా మాట్లాడవలసిన విషయాలన్నీ ముగిసిపోయి, వేరేమి విషయముందనే ఆలోచన మా తలలను విసిగించే వేళకు సరిగా - ఆ కారు మా కళ్ళలో పడింది

తీర్థహళ్ళినుండీ ఆగుంబెకు పోయే దారి - ఒక విషయం మినహాయిస్తే - నిజానికి స్వర్గానికి దారి. ఇరుప్రక్కల గల పెనువృక్షాల అరణ్యమూ, కనుపండువు కలిగించే పచ్చదనమూ, ఊపిరి బిగబట్టింపజేసే లోయలూ, లోయల లోతుల్లో ఎక్కడో కనిపించే పోక తోటలూ, ఎక్కి, దిగి, వంపులు తిరిగి దాగుడుమూతలాడే తరుణీమణి సీమంతపు వక్రవిన్యాసంలా శోభిల్లే కెంపుదారి మధ్య మధ్య కళ్ళకు కొట్టవచ్చేటట్లు కనిపించే—వేరెక్కడ కూడా కనిపించని--పూలూ, చెట్లూ, ఒకే సమయంలో భావప్రపంచాన్నె వ్యక్తంచేసే గాయకుని ప్రతిభలా ఒక ఆకుపచ్చ వన్నెలోనే విశ్వ సౌందర్యాన్నంతా నిమిన ప్రకృతిదేవి ప్రతిభ! నిజానికి ఆగుంబె దారి సజీవకవిత అయితే ఈ సౌందర్య సాధనలో మారస తపస్సుకు భంగం కలిగించే ఒక అప్సరస ఆ దారిలో వున్న సున్నని కెంధూళి. కనులూ, చెవులూ, ముక్కూ, నోరూ - అన్నిటినీ నింపే ఆ ధూళి, ఈ ఇంద్రియాలు వేరే ఏ పనికీ ఉపయోగపడనట్లుచేసి, ఆ స్వర్గాన్ని ఒకే గడియలో నరకంగా మార్చుతుంది

పిల్లగాలికే చెదరి మొగిలులా లేచే ఆ ధూళికి ఇంకా వేగంగా పరుగెత్తే వేయిచక్రాల సాయం దొరికితే చెప్పాలా? లోకంలో కెంధూళి తప్ప వేరేమీ లేనేలేదనేరీతిగా వుంది—మా ముందు పోతూన్న కారు మా మీదికి నిర్దాక్షిణ్యంగా చిమ్ముతూన్న దుమ్మును చూస్తే. ఆ ధూళి రాయిడి పది నిమిషాలు సహించేటంతలో, మాకంతా ఆగుంబెను మరచి, తీర్థహళ్ళికి వెనుదిరిగి పోవాలనిపించేటట్లయింది. మా అవస్థను చూసి కారు సారధి విశ్వనాథ్, మేము తాగి అనుభవించిన దుమ్మును ముందర పోతున్న కారు డ్రైవరు తాగేటట్లు చేస్తానని శపథంచేసి, పాత ఫోర్డు బేకర్ బండి ఎంత వేగంగా పరుగెత్తవచ్చునో, అంత వేగంగానూ పరుగెత్తించాడు.

మా ముందు పోతున్న కారు కొత్తది. మా కారుకు రెట్టింపు వేగంతో పరుగెత్తగల అశ్వశక్తిగల వాహనం. దాన్ని మేము దాటడం సాధ్యమా! ఆ ఉత్సాహంలో మేము మరింత ఎక్కువగా దుమ్ము తాగడం తప్ప, వేరేమీ ప్రయోజనం వుండదని నాకనిపించింది. అయితే విశ్వనాథ్ ప్రచండుడు. కారు పోతున్న రీతి చూసి, ఆ దారికి వాళ్ళు కొత్తవాళ్ళని గ్రహించి,

ఆ కారు ఒక మలుపును తిరిగేటప్పుడు వేగాన్ని తగ్గించిన సందర్భం వినియోగించుకుని, ముందున్న కారులోనివాళ్ళ చెవులు చిల్లులు పడేటట్లు హారన్ మ్రోగించి, బెదరించి, మా కారును ముందుకు పరుగెత్తించాడు.

"ఇప్పుడు బాగా దుమ్ము తాగనీ ఆ పాపాత్ములు!— వాళ్ళకు పదిరోజులు భోజనం ఖర్చు మిగులుతుంది!"

—అన్నాడు విశ్వనాథ్. పోటీలో గెలిచిన ఉత్సాహంతో. వట్టి దుమ్మేనా? దానితోపాటు మా కారు వెనుకతట్టునుంచీ ధారాపాతంగా చిమ్ముతూన్న పొగనూ వాళ్ళు తాగవలసి వుంది.

అయితే మేమెవరమూ వెనకాలగల కారులోగల వాళ్ళను కనికరించే స్థితిలో లేము.

"రే! ఆ కార్లో వున్నవాళ్ళని చూశావేమిరా?" అన్నాడు అరసు నా భుజం గిల్లి.

"ఆ దుమ్ములో ఏమీ కనిపించలేదు. ఎవరున్నారు?" అన్నాను నేను

"నీవు పాపాత్ముడివి! దుమ్ము తాగి విసిగిపోయిన కళ్ళు ఒక గడియ సంతోషపడనిమ్మని దేవుడు ఆ కారులో ఒక సుందరాంగిని పంపితే ఆ అవకాశాన్ని పోగొట్టుకున్నావే! నీలాంటి పాపాత్ములు లోకంలో ఉండగలరా?"

—అన్నాడు అరసు నా దౌర్భాగ్యాన్ని కనికరించి నిట్టూర్పు వదులుతూ. "నిజంగా బ్యూటిఫుల్ ఉమన్ సార్" అన్నాడు విశ్వనాథ్ మిగిలినవాళ్ళూ ఆమెను చూశారు. వాళ్ళందరూ ఆ యిద్దరితో కంఠం కలిపినపుడు, చివరికి, నేనే ఒక దురదృష్టవంతుడైన పాపాత్ముడివి అనుకునేటట్లయింది

అంతతోనే ఆగక వాళ్ళు ఒకరితో ఒకరు పోటీపడి ఆ కారు నడుపుతున్న అంగనామణి అంగాంగ వర్ణనకు పూనుకున్నారు. అక్కడికీ ఆగలేదు మాటలు

"కార్లో ఆమె ఒకతేనోయ్—తోడొక డ్రైవర్ - అంతే, ఆ డ్రైవర్ అదృష్టవంతుడోయ్."—అన్నాడు ఒ.పి.

"ఊఁ! దారిలో ఎక్కడైనా కారు చెడిపోయి, ఆగిపోతే, అతడి అదృష్టం చెప్పడానికి వీలులేనిది "

—అన్నాడు వెంకటశ్యామ్-ఊహను చైతన్యవంతంగా చేసి.

"కాదు సార్, కాలమెంతగా చెడిపోయింది? ఒంటరి మగువ అందులోనూ సొగసుకత్తె. ఇలాంటిదారిలో ఒంటరిగా, ఒక డ్రైవర్ జతతో ప్రయాణం చేయటమంటే, ఏమనుకున్నారు? 'పురుషుడు అగ్నికుండం; తరుణి నవనీతభాండం' అని చెప్పారు వ్యాసమహర్షిగారు. అలాంటప్పుడు ఆ డ్రైవరు మనసేమైనా చెడితే, గతేమి? కలికాలం సార్, అంతా చెడిపోయింది "

—అన్నాడు హిందీ పండితుడు గొణుగుతూ.

"డ్రైవరు మనస్సు చెడటమే వీరికి కావాలి, పండితవర్యా. ఈ కాలం ఆడవాళ్ళను మనం చూడలేదా? మా కాలేజీలో నేను చూశానుగా - ఈ కాలపు ఆడపిల్లల్ని."

—అంటూ అప్పుడప్పుడే కాలేజీ మెట్లెక్కిన మానప్ప తన అనుభవామృతాన్ని పంచిపెట్టాడు

దానితో మాటలు - ఈ కాలపు ఇంతులూ, వాళ్ళ నవీనతా, మాదకతా, వాళ్ళ వయస్సూ, ఫ్రాయిడు మనస్తత్వశాస్త్రమూ, పురుషులతో సమానతకు పోటీపడేవాళ్ళ పిచ్చి పిచ్చి చేష్టలూ, వాళ్ళ కట్టూ, బొట్టూ, దానికి కారణమైన నేటి నాగరికతా, మనుజుని అల్ప వాంఛలను రెచ్చగొట్టే నేటి అనిశ్చిత పరిస్థితి-వీటన్నింటిని గురించీ ముగించి చివరికి శాశ్వతమైన పాప పుణ్యాల చర్చకు దిగాయి.

"ఇప్పటి మనుషులకు పాపభీతి లేనేలేదు. నేటి జనులంతా భోగవాదులు బలి యివ్వబడే మేకపోతు తోరణపు చిగురుని తినేరీతిగా, ఇప్పటి సుఖమే శాశ్వతమని భ్రమిస్తారు "

—అంటూ హిందీ పండితుడు వ్యాఖ్యానించినపుడు, నేటి సుఖానికన్నా రేపటి చావుకే ఎక్కువ విలువా? చాలు. బదుకు చావుకు సిద్ధం కావడానికి కాదు - చావు వస్తుంది. రానీ. దానికి ముందు ఇక్కడిదేముందో అది అనుభవిద్దాం'

—అన్నాడు మానప్ప.

"కాదు, పండితవర్యా. చచ్చిన తర్వాత దొరికేవి— అచ్చరా, అమృతమూ. అవి లభించాలంటే చావాలి అవి, చచ్చే కష్టమే లేకుండా, ఇక్కడే లభిస్తూన్నట్టయితే, అనుభవించిన తరువాతే చావడంలో తప్పేముంది? మాటవరుసకు చెబుతాను. వెనకాల వచ్చే కారులో వస్తూన్న అప్సరస, కారు నిలిపి, పెదవిలు విప్పి, 'ఎ కిస్ ప్లీస్' అన్నదనండి. అపుడు మీరేం చేస్తారు? మనమిద్దరమూ వేగ మరణిద్దాం. నీవచ్చరవైరా; నేనమరుడనై వేచివుంటాను'. అంటారా? లేక, వేగంగా ఆమె కోరిందిచ్చి, 'సే ఇట్ ఎగైన్ ప్లీస్' అంటారా? ఇపుడు చెప్పండి" అన్నాడు కిలాడి అరసు.

అతడు చెప్పింది విని, బ్రహ్మచారియైన పండితుడి ముఖం ఎర్రబడ్డది. "పాపి! పాపి!" అంటూ తనలోనే గొణుగుతున్నాడు. అందరూ నవ్వారు.

మా మాటల్లో మేము మునిగి వున్నప్పుడు సారథి విశ్వనాథ్ — మరొకరకపు ఆటలో నిమగ్నుడై వున్నాడు— వెనుక వస్తున్న కారులోని వాళ్ళతో.

మా కారు ముందై ఆ కారు వెనుకబడిన సంగతి అప్పుడే చెప్పాను గదా. అలా ముందై, వెనకాల వున్నవాళ్ళకు దుమ్ము తాగించినంతమాత్రాన విశ్వనాథునికి తృప్తి కలిగినట్టు లేదు. దానితోపాటు వెనకాల వస్తున్న కారులోని వాళ్ళతో ఆటలాడటం మొదలుపెట్టాడు కారును అంత దూరం వేగంగా నడపి, నిదానించడమూ, వాళ్ళు తమ కారు వేగం హెచ్చించి దగ్గరికి వచ్చినపుడు ధూళి, ధూమాలను మరింత చిమ్మి వేగంగా కారును పరుగెత్తించడమూ. ఈ ఆట ఒకేవిధంగా నడిచింది. తమాషా చేయడానికి ఆడుతున్న ఈ ఆట వెనకాల వస్తున్న కారులోని అంగన ఓర్పును పరీక్షిస్తూ వున్నదనడం ఆ కారు హారన్ నిరంతర ఘోషవల్లనే తెలుస్తూండేది అయితే విశ్వనాథ్ అది చెవిని పడనివానిలా, వెనకాల వస్తున్నవాళ్ళకి దారియివ్వక, తన కారును ఎక్కువ వేగంతోనూ పరుగెత్తించక, ఆట ఆడిస్తున్నాడు.

ఇంతసేపటికి నాకు ఆ ఆట చాలయిందేమో అనిపించి, "పోనీలే, విశ్వనాథ్ వాళ్ళకు దారి వదిలేయి మనమెలానూ ఇక్కడున్న ఆగుంబెకే కదా వెళ్ళడం? వాళ్ళింకా ఎంత దూరం వెళ్ళాలో, యేమో, ఘాట్ రోడ్‌లో చీకట్లో ప్రయాణం, ఏం తొందరో...." అన్నాను.

"అదంతా నమ్మకు విశ్వనాథ్ వీడు ఆవిడను చూడడానికి వీలుపడలేదు. ఇప్పుడైనా చూద్దామని ఈ ప్లాన్ వేస్తున్నాడు. డోన్ట్ గివ్ దిస్ డాగ్ యే ఛాన్స్!"

—అన్నాడు జగడాలగొండి అరసు.

"ఆవిడని చూడాలా, సార్? అంత ఆశగా వుందేమి? అలా అయితే చెప్పండి. వాళ్ళ కారు నిలిపే చూపుతాను. కావాలంటే ఆమెతో మాటలు కూడా మాట్లాడండి; కళ్ళారా చూడండి!" అన్నాడు విశ్వనాథ్ నవ్వుతూ. మిగిలినవాళ్ళు ఆ నవ్వుకు తమ నవ్వుల్ని శ్రుతి కలిపారు. నేనూ నవ్వాను - నవ్వకుండా వుండటానికి వీలు లేకుండా వుంది.

"ఆ కారును ఆపితే ఉపయోగం లేదు విశ్వనాథ్. దానికి డ్యాష్ కొట్టెయ్యాలి - దానిలో వున్నవాళ్ళకు అపాయం కలుగనట్లు. దెన్ దేరీజె ఎ ఫెయిర్ ఛాన్స్." అన్నాడు అరసు.

"చాల్చాలు. ఎవరింటి ఆడబిడ్డో, ఏ పుణ్యాత్ముడి సతీమణో, ఇలా మాట్లాడవచ్చునా! ఇలాటి ఆలోచన చేయడం కూడా పాపం"—అన్నాడు హిందీ పండితుడు.

"పోనీలేవోయ్, అరసూ, అతడినెందుకు చంపుకు తింటావ్? ఆ తీగను చూడు, ఎంత అందంగా వుంది"—అన్నాను నేను, ఆ మాటలకు వేరే మలుపివ్వడానికి.

అయితే ఆ మాటల్ని ఆ మగువనుంచి మళ్ళించడానికి మనస్సున్నట్టులేదు - ఎవ్వరికీ ఇలా చిల్లరమాటలు ధారాళమై, నవ్వుల తరంగాలుగా మారి దారి సాగింది.

ఆగుంబె కూడా వచ్చింది

బాట ప్రక్కనగల హోటల్లో కాఫీ తాగడానికి మేము కారు ఆపినపుడు వెనకాల వుండిన కారు వేగంగా ముందుకు దూసుకుని ఉరికింది.

కారులో కూర్చున్న నారీమణిని నేను చూశాను. నిజంగా ఆవిడ అందాలరాణియే.

ఆవిడ కూడా మావైపు చూపింది. జగత్తులోని పగ సమస్తమూ ఆ ఒక్క చూపులో ఇరుక్కుని వుంది!

ఆ చూపును చూసిన నాకు అనలాన్ని చుంబించినట్లయింది.

ఆవిడ మనస్సుకు పూర్తిగా విసుగును కలిగించినట్టుంది విశ్వనాథ్ అంతగా ఆట్లాడించకుండా వుంటే బాగుండేది. మన వైపు చూపింది చూశావా? చాలా కోపించుకున్నట్లుంది-అన్నాను నేను

"అంగన అందానికి అలుక అదనపు సౌందర్యాన్ని ప్రసాదిస్తుంది. సుబ్బూ. ఆ మాత్రం తెలీని నీవెంతటి నవలాకారుడివి? దద్దమ్మా, అలుక వలపుకు మరొక ముఖం. అంత మాత్రం తెలీదా?" - అన్నాడు అరసు నవ్వుతూ.

నేను ఆ మాటల్ని ముందుకు పెంచలేదు. అందరూ ముఖాలు కడుక్కుని, కాఫీ తాగి, సూర్యాస్తమయాన్ని చూడటానికి, అందుకోసం నిర్మించిన వేదికవద్దకు కారులో వెళ్ళాం.

ఆగుంబె దారియే ప్రకృతి సౌందర్యపు పరసీమ అనుకుని వున్న నాకు, ఆగుంబె ఘాట్ దారి రమణీయత చూసినపుడు,

చూసే కళ్ళూ, వర్ణించి తృప్తి చెందని బుద్ధీ - రెండూ అలసి పోయాయి. పర్వతపు వెన్ను మీద నిర్మించిన వేదికమీద నిలబడి, అక్కడినుండీ అంబుధి అంచువరకూ పరచుకున్న వనశయ్యను కని, మంత్రముగ్ధత ఏర్పడింది. దూరంలో, బహు దూరంలో, మెరుపుకత్తుల్లా వెలిగే కడలి తెరలు కళ్ళకు కొట్టవచ్చేలా ప్రకాశిస్తున్నాయి. ఈ భవ్యదృశ్యమే హృదయంనిండి బ్రతుకు ధన్యమైందనిపించిన వేళలో, చుట్టూరా వున్న మేఘాలకు బంగరు వసంతం చల్లి, రకరకాల ఆకారాలను ధరించి, కడలిలో కనుమరుగైన సూర్యాస్తమయరమణీయత భగవత్సృష్టిలోని ఒక అద్భుతంలా అనిపించింది.

మేమందరమూ మమ్మల్నీ, మా పరిసర ప్రపంచాన్నీ విస్మరించి, అవలోకించాం.

"దీన్ని చూశారు కదూ. అలానే సోమేశ్వరందాకా వెళ్ళి వచ్చేద్దాం"—అన్నాడు విశ్వనాథ్.

"అక్కడేముంది విశేషం?" అంటూ ప్రశ్నించాను నేను.

"ఘట్టప్రదేశపు ఆరోహణ మార్గానికన్నా దాని అవరోహణ మార్గపు సౌందర్యం అధికమైంది. అందులోనూ ఆగుంబె ఘట్టప్రదేశం సౌందర్యం అధికతరం. ఏదే మైనా ఒక్క-" అన్నాడు.

అందరూ అందుకు అంగీకరించారు. వేదికనించీ బాటలోకి దిగి, కార్లో కూర్చుని బయలుదేరాం.

దిగే దారి వరుస మలుపులలో కారు బొంగరంలా తిరిగింది. వచ్చిన దారిది మనోహర సౌందర్యమైతే దిగే ఈ దారిది హృదయాన్ని వణికింపచేసే రుద్రరమణీయత!

"చావు బ్రతుకుల నడిమి అంతరం యెంత అంటూ తెలుసుకోవాలంటే ఇక్కడికి రావాలి." - అన్నాడు అరసు—వేలాది అడుగుల లోతైన లోయకు అంచులోనే కారు తిరుగుతున్నప్పుడు

—చావూ, బ్రతుకూ; ఏడుపూ, నవ్వూ; సౌందర్యం, వికారం - ఇంతే అంతరం; ఎంత సమీపం!

ఎందుకో నాకా మాటలు విని హృదయం వణికింది.

"అదిగో! సోమేశ్వరం!" అన్నాడు విశ్వనాథ్.

అతడు వేలుపెట్టి చూపినవైపుకు చూశాను. నాకు కనిపించింది సోమేశ్వరంలో దారిపక్కన గుమిగూడిన జనసమూహం; అస్పష్టంగా వినిపిస్తున్న జన కోలాహలం.

"ఏమో యాక్సిడెంట్ అయ్యుండాలి"

—అన్నాడు, నేను చూసిన దిక్కుగా చూసి విశ్వనాథ్, కారు వేగాన్ని ఎక్కువచేసి

అనతికాలంలోనే మా కారు గుంపును సమీపించింది.

గుంపువద్దకు వచ్చిన వెంటనే, అందరూ కారునుంచీ దూకి, ఏం అనాహుతం జరిగిందోనంటూ చూశాం.

చూశాను. తల గిర్రున తిరిగినట్లయింది.

ఘట్ట ప్రదేశంనుంచీ వేగంగా దిగివచ్చిన ఒక కారు బాట పక్కనగల ఒక మైలురాతిని ఢీకొని, ముక్కలు ముక్కలై పోయి వుంది. కారు ఢీకొన్న వేగానికి లోపల వున్నవాళ్ళ ఒళ్ళూ, ముఖమూ పచ్చడై, రక్తం కారుతూండగా అంత దూరంలో ఎగిరి పడివున్నారు.

రెండు శవాలు!

"అదే కారు! అదే మనుషులు!"

—అన్నాడు విశ్వనాథ్.

నిజం—అదే కారు. మేం దాటి, ఆటలాడించిన కారు. ఆ కారులో ఉండినవాళ్ళు—ఆ డ్రైవరూ, ఆ అంగనా - ఉత్త నెత్తురు కారే భయంకర శవాలు! చూసేవాళ్ళ ముఖాల్లోనూ, నవ్వూ చచ్చి, దాని శవం తేలుతోంది. ఆమెను చూసి నవ్విన మేము.

—చావు మమ్మల్ని చూసి నవ్వుతోంది.

"ఎలాంటి చావు!"

—అన్నాడు మానప్ప—చలిగాలికి చిక్కినట్టు శరీరాన్ని వణికిస్తూ.

"చావు కాదు-ఖూనీ! నేను ఆమెను దారిలో చెలరేగించడమే ఆమె అధిక వేగంగా దారిచూడక కారును పరుగెత్తింప చేయడానికి కారణమై ఉండొచ్చు. ఇలా అవుతుందని తెలిసివుంటే, అలా చేసివుండేవాడిని కాను."

—అన్నాడు విశ్వనాథ్ హీనస్వరంతో.

ఆ మాటలు విని నా శరీరానికి చలి పట్టినట్టయింది—ఇలా అవుతుందని ఎవరికి తెలుసు?

"ముద్దిచ్చే పెదవులు, అన్నారు కదా, సార్. ఇపుడు ముద్దివ్వండి! అలాంటి పాపభూయిష్ఠపు ఆలోచన వద్దని అప్పుడే చెప్పానే!"

—అన్నాడు పండితుడు చేదైన ధ్వనితో అరసువైపు చూసి.

"పాపి....పాపి....నేను కాదు పాపి"

—అన్నాడు అరసు బిగిసిన ధ్వనితో.

"మరింకెవరు?"

—రెచ్చగొట్టేలా అడిగాడు పండితుడు.

"నేను కాదు - దేవుడు! ఈ మోహక సౌందర్యాన్ని సృష్టించి, అది ఎవరి ఆస్వాదనకూ అందనట్లు చావు తెరను దానిమీది కీడ్చాడే, ఆ మీ దేవుడు! - వాడు పాపి! సౌందర్యానికి సన్నిధియైన ఆగుంబె ఘట్టప్రదేశంలో, ఈ సౌందర్యానికి చావు తెచ్చిన ఆ దేవుడు పాపాత్ముడో, అతడు సృష్టించిన సౌందర్యానికి ముద్దుల కానుకలను సమర్పింపదలచిన నేను పాపాత్ముడినో- చెప్పండి?"

—అంటూ సవాల్ చేసేవిధంగా, బిగ్గరగా బిరుసైన, కరుకైన కంఠధ్వనితో ప్రశ్నించాడు అరసు.

చీకట్లు నిండిన ఘట్టప్రదేశపు పర్వతశ్రేణి ఆ ప్రశ్నను ప్రతిధ్వనించింది.

చుట్టూ గల ప్రకృతిని చూశాను. అందరి నగుమొగాల మీదనూ మరణం ఇరుల తెరలను కప్పివుంది. ఒక గడియ ముందు సౌందర్య సంతర్పణ చేసిన ఆగుంబె ఘట్టప్రదేశం కాళకరాళ దైత్యునిలా శరీరం చాచుకుని వుంది.

అదే ఘట్టప్రదేశం; అదే అరణ్యం; అదే జనం - అయితే అప్పుడు చూసింది ఇదే ఇప్పుడూ అదే ముఖమే. అయితే ఎంత అంతరం?

# కవితా ముద్గరం

## శ్రీ మంగళగిరి పూర్ణచంద్

ఏదో ఒకచోట
ఏదో "సమ్" కుల సమరం
సాగుతూనే ఉంటుంది.
స్వార్థం పెత్తందారీకి
మతం కమతానికి కుదురుకుంటుంది
"చీలికల" ఏలికలకు
జనం భజనం
జరూరు జరుగుతూనే ఉంటుంది.
కడగళ్ళ వడగళ్ళ వానకు
జడిసిన వెట్టితనం
"వంచన" పంచన ఒళ్ళు దాచుకుంటుంది.
సిరి ముసిరిన మైకం సాచిన
కిరాతకపు కోఱలు
"తలరాతల" చాఱలుగా సరిపెట్టుకొని
పేదరికం పెదవి విరుచుకుంటుంది.

అప్పుడు,

నిజం ఖనిజంతో చేసిన
నా కవితా ముద్గరం
చీకట్ల గట్లు తెంపి,
వెలుతురు కేరుల్ని
ఎదలనిండా పొంగించి
పచ్చని బతుకుల్ని పండిస్తుంది,
ఫలితం సరిసమంగా అందిస్తుంది.

నా కవితాముద్గరం
జనహితైక భావనోద్గతం.

డా॥ వి. సత్యనారాయణ

# శ్రీమద్భాగవతంలో నవవిధ భక్తులు

"క. నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులు గావు ముక్తి సుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబుఁ బఠింప ముక్తి నివసనము బుధా!"
(భాగ 1.139)

ఈ పద్యంలో భాగవతము నిగమముగా పేర్కొనబడింది. ముక్తిని పొందుటకు భాగవత ధర్మముతో పోలినది మరియొకటి లేదని భాగవత మతము

భాగవత మతమునకే నారాయణీయమని, సాత్త్వతమని, ఏకాంతికమని, పాంచరాత్రమని పేర్లు [1] ఈ మతము అనాదియైనదైనను, దీనికి ప్రధానాధారములు మహాభారతంలోని నారాయణీయ విభాగము, భగవద్గీత, నారద సూత్రములు, శాండిల్య సూత్రములు మరియు భాగవత పురాణము.

భక్తి తత్త్వము వేదాలలోని వరుణ, సవితృ, ఉషస్సులకు సంబంధించిన మంత్రములలో ప్రథమంగా కానవచ్చుచున్నది. కఠ, ముండక, శ్వేతాశ్వతర, బృహదారణ్యక, తైత్తిరీయోపనిషత్తులలో ఈ తత్త్వము. కొంత విస్తృతి దాల్చినట్లు గనబడును. వీనిలో ప్రపత్తి, అర్పిత విధానము, భగవంతుని దయను కాంక్షించుట మున్నగు లక్షణములు విశదీకృతమైనవి. దీని విస్తృతి ఇతిహాస పురాణములలో విస్పష్టము.

"భజ్యత ఇతి భక్తం భజ సేవాయామ్" అని అమరంలో దీని వ్యుత్పత్తి నిర్దేశింపబడింది. (చూ. ద్వి. కాం వైశ్యవర్గము)

శంకర, రామానుజ, మధ్వాచార్యులు. భక్తియననేమి'టో వివరించిరి. నారదభక్తి సూత్రములు, భగవద్గీత, భక్తి రసాయనము మొదలగు గ్రంథజాలములోను భక్తియననేమిటో వివరింపబడింది. ఇక్కడ రెండింటిని మాత్రము పేర్కొనెదను

నారద భక్తి సూత్రములలో—

"పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తిరుచ్యతే" అనియు,

"పరానురక్తిరీశ్వరే। సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా"

అనియు తెలుపబడింది. ఒక్క క్షణం కూడా పరమేశ్వరుని యెడబాటు సహింపలేకపోవుటయు, పరమ ప్రేమస్వరూపమున్న భక్తియని దీనివలన దెలియుచున్నది. (నార. సూ 21)

మధుసూదన సరస్వతి భక్తి రసాయనంలో—

"ద్రుతస్య భగవద్ధర్మాద్ధారావాహికతాం గతా।
సర్వేశే మనసోవృత్తిః భక్తిరిత్యభి ధీయతే॥" అని

సర్వేశ్వరుని స్మరించుటచేత ద్రవించిన మనస్సులో ఏకధారగా బయల్వెడలిన ఏకాకార వృత్తియే భక్తియని వివరింపబడింది.

ఇట్టి భక్తియోగము వలన ఈశ్వరానుగ్రహము కలిగి భ్రాంతిహేతువైన మాయ తిరోహితమగును. ఎప్పుడు మాయ నశించునో అప్పుడు స్వస్వరూపజ్ఞానము కలుగును. ఈ స్వరూప జ్ఞానమే భగవంతుడు. అదియే ముక్తి

సంసారము హ్రదము, బాధములు నక్రము. దానినుండి తరణోపాయమునకై గజేంద్రుడు భగవంతుని ప్రార్థించెను సంసారబంధ మోక్షణమే జీవికి పరమార్థము ఇది భక్తి సిద్ధాంతముయొక్క సంగ్రహ రూపము

భక్తి స్వరూపము అనేక విధములని భాగవతము నుడువుచున్నది. (భాగ. 3-942) భాగవతము తృతీయ స్కందంలో తామస రాజస సాత్త్విక భేదములచే త్రివిధ వర్గీకరణమున్ను, (భాగ. 3-943), ఆత్మతత్త్వజ్ఞాన, వైరాగ్యాదులైన చతుర్విధ వర్గీకరణమున్ను, (భాగ. 3-1017, 1018) విస్పష్టము గావించినది ఇవిగాక అచటచట మరికొన్ని భక్తిస్వరూప భేదములు సందర్భోచితముగ పేర్కొనబడినవి. అట్టివానిలో ఈ క్రిందిదొకటి—

1. కల్చరల్ హెరిటేజ్ ఆఫ్ ఇండియా-భాగవత రెలిజియన్; ది కల్ట్ ఆఫ్ భక్తి - బై జదునాథ్ సిన్హా. పు. 146.

శా "కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రింగంటిమెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుఁడైన హరిఁజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"
(భాగ. 7-18)

ఇది నారదుడు ధర్మజునికి చెప్పినమాట. ఇందు షడ్విధమైన భక్తియోగము తెలుపబడినది.

ఇట్లే మరికొన్నిచోట్ల వివిధ భక్తియోగ మార్గములు స్పష్టముగాను, స్పష్టాస్పష్టముగాను తెలుపబడినవి.

వీని అన్నింటిలో ప్రహ్లాద చరిత్రలో దెలుపబడిన నవవిధ భక్తిమార్గము సుప్రసిద్ధము.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్
ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవ లక్షణా
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీత ముత్తమమ్"
(సం. భాగ 7-5-23, 24)

ఇదియే ఆంధ్ర మహాభాగవతంలో ఇట్లున్నది—

"మ. తను హృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరి న్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!" (భాగ 7-167)

తెలుగు భాగవతంలో క్రమము మారినది. ఆత్మ నివేదనమునకు బదులు ఆత్మలో నెఱుక అనునది గ్రహింపబడినది. సంస్కృత భాగవతంలో ఆత్మ నివేదనము చివరి మెట్టు కాగా తెలుగులో చింతనము చివరిదైనది.

ప్రస్తుత వ్యాసంలో సంస్కృత భాగవతంలోని క్రమమునే గ్రహించి ఈ నవవిధ భక్తిరీతుల సమన్వయ సమాలోచనము గావిస్తున్నాను.

శ్రీధరాచార్యులు భావార్థ దీపికయను వ్యాఖ్యలో ఈ నవవిధ భక్తులలో కొన్నిటి నిట్లు వివరించెను.

"పాద సేవనం పరిచర్యా; అర్చనం పూజా; దాస్యం కర్మార్పణం; సఖ్యం తద్విశ్వాసాది; ఆత్మ నివేదనం దేహ సమర్పణం"

చివరిదైన దేహ సమర్పణమను నర్థము నిట్లు విశదీకరించెను.

"యథా విక్రీతస్య గవాశ్వాదేః భరణ పాలనాది చింతా నక్రియతే తథా దేహం తస్మై సమర్ప్య తచ్చింతావర్జన మిత్యర్థః"

—గవాశ్వాదులను అమ్మివేసిన తరువాత వాని భరణ పాలనాది చింత ఏల ఉండదో దేహ సమర్పణ తదుపరి అట్టి చింత ఈ దేహముపై నుండకపోవుట దేహ సమర్పణము.

వివరణకర్తయైన వీరరాఘవులు శ్రవణ మనగా తత్స్వరూప రూపగుణ విభూతి శ్రవణమనియు, స్మరణమన స్వరూపాది విషయకమనియు, వందనమన నమస్కారమనియు తెలిపెను. కీర్తనమన నామోచ్చారణాత్మక మనెను. 'పాద సేవనం పరిచర్యా' యని శ్రీధరులనగా ఇతడు 'పాదయో స్సంవహనం తచ్చార్చా విగ్రహ తదీయ పాదయోశ్చేతి వేదితవ్యం.' అని తెలిపెను. ఇంకను 'పరవ్యూహ విభవాదే రతీంద్రియత్వేన. తత్పీడనా సంభవాత్' అని విమర్శించుకొని 'యద్వా భగవద్విషయే మానసికం' అని సమర్థించెను.

ఈ శ్రవణాది భక్తివిధానములు భగవంతునినుండి అవిలంబమును గలిగించునవి. భక్తియోగ పరిపక్వమునకు సోపానములు. చివరి మెట్టు అయిన దేహసమర్పణబుద్ధి స్థిరపడినచో కైవల్యప్రాప్తి సుకరమగును. ఇది సూక్ష్మంగా ఈ నవవిధ భక్తియోగము యొక్క ఉద్దేశ్యము.

"మ. అవశబ్దంబులఁ గూడియున్ హరి చరిత్రాలాపముల్ సర్వ పా
ప పరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబు గీర్తింపుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా! తత్త్వజ్ఞ! చింతింపుమా!" (భాగ 1-95)

ఇట్లు హరినామ కీర్తన శ్రవణాదులచే భక్తకోటి ముక్తసంగు లగుదురని భాగవతంలో పెక్కుచోట్ల నుడువబడినది.

ఈ భక్తిరీతులు భాగవత ధర్మములని ప్రహ్లాదుడు తోడి బాలురతో ననెను. (7-239) వీని నాచరించుచు కామక్రోధాదులను జయించి, ఇంద్రియ నిగ్రహము కలిగి భక్తిప్రవృత్తుడైనచో

'విష్ణుదేవుని యందుల గతి సిద్ధించు' (7-239)నని యాతడు వివరించెను. కావున భాగవతమతములో నవవిధ భక్తిరీతులు ప్రముఖ స్థానము నాక్రమించుచున్నవి. మానవుని మోక్షసిద్ధికి ఈ మార్గము రాజమార్గము.

సాధారణముగా భక్తులు ఈ నవవిధ మార్గమును ఆచరించు వారైనను వీనిలో వారికి కొన్నిటియందు ప్రత్యేక శ్రద్ధ గలిగి వానినే సదా ఆచరించుచు కైవల్యప్రాప్తిని పొందుట గనిపించును. అట్లు ధన్యులైన కొందరు మహావ్యక్తుల భక్తిరీతులను దెలుపు సుప్రసిద్ధ శ్లోకమొక్కటి ఉన్నది.

"శ్రీ విష్ణోః శ్రవణే పరీక్షిదభవద్వైయాసకిః కీర్తనే
ప్రహ్లాదః స్మరణే తదంఘ్రి భజనేలక్ష్మీః పృథుః పూజనే
అక్రూరస్త్వభివందనే కపిపతిర్దాస్యేచ సఖ్యేఽర్జునః
సర్వస్వాత్మ సమర్పణే బలి రభూత్ కృష్ణాప్తిరేవం విధా"

శ్లోకంలో పేర్కొనబడిన భక్తుల క్రమమును పట్టికగా వేసిన నిట్లుండును.

| | | |
|---|---|---|
| 1. శ్రవణ | భక్తి | పరీక్షిన్మహారాజు |
| 2. కీర్తన | ,, | శుక మహర్షి |
| 3. స్మరణ | ,, | ప్రహ్లాదుడు |
| 4. పాదసేవన | ,, | లక్ష్మిదేవి |
| 5. అర్చన | ,, | పృథు చక్రవర్తి |
| 6. వందన | ,, | అక్రూరుడు |
| 7. దాస్య | ,, | హనుమంతుడు |
| 8 సఖ్య | ,, | అర్జునుడు |
| 9. ఆత్మసమర్పణ | ,, | బలి చక్రవర్తి |

భాగవతంలో వీరుగాక ఈ భక్తిరీతులచే ముక్తులైన భక్తవరేణ్యులు పెక్కురు గనిపింతురు.

పై శ్లోకంలో శ్రవణభక్తికి పరీక్షిత్తు ఉదాహరింపబడెను. శృంగిచే తప్తుడైన పరీక్షిత్తు తాను చేసిన పనికి విచారించి సంసారమునందు విరక్తుడై భగవత్సాన్నిధ్యము తనకెట్లు లభించునో యని ఆలోచించుచుండగా దైవికముగా శ్రీ శుక మహర్షి అతని చెంతకేతెంచెను. పరమేశ్వరునియెడ సంపూర్ణమగు భక్తి గలిగియున్న యెడల ఈ ఏడు రోజులలోను కైవల్యప్రాప్తిని పొందవచ్చునని పలికి ఒక్క ముహూర్తకాలంలో ముక్తుడైన ఖట్వాంగ చక్రవర్తి చరిత్రను వినిపించెను. ఆ విధముగా సప్త దివసములలో భగవంతుని లీలలను భక్తుల చరిత్రములను శుకుడు భాగవత పురాణరూపంలో వినిపింపగా విని తరించినవాడు పరీక్షిన్మహారాజు.

శ్రవణ సుఖమెంత గొప్పదో పృథు చక్రవర్తి విష్ణుమూర్తితో యనిన ఈ పలుకులలో విస్పష్టమగుచున్నది-

"చ ... .. ... .. . .     ......... .వాగ్వి నిర్గతం
బనఁదగు తావకీన చరణాంబుజ చారు మరంద రూపమై
తనరిన కీర్తియున్ విని ముదంబును బొందఁగలేని మోక్షమై
నను మదిఁ గోరనొల్ల నఘనాశ! రమేశ! సరోజలోచనా!"
(భాగ 4-552)

భాగవతంలో శుకమహర్షి వినిపింప పరీక్షిత్తు శ్రవణ సుఖమును పొందినట్లే సూతుడు వినిపింపగా శౌనకాది మహా మునులను, మైత్రేయుడు వినిపింపగా విదురుడును శ్రోతలైరి.

శ్రవణభక్తిలో పరీక్షిత్తాదులు శ్రోతలు కాగా శుకమహర్షి మొదలగువారు కథకులు వీరు హరికథలను కీర్తించి కీర్తన భక్తియుతులైరి. శ్లోకంలో కీర్తన భక్తికి శుకుడు పేర్కొనబడెను. ఈ కీర్తనము వలన తాము తరించుటేగాక శ్రోతలను తరింపజేయుట వీరి విశిష్టత. ఇట శ్రవణ కీర్తనములు పరస్పరాధారాధేయములు. ఈ రెండింటికి మూలము భగవన్నామము; తల్లీలలు

భాగవతంలో విష్ణుమూర్తి కథాకీర్తనమేగాక నామకీర్తనమున్ను పెక్కుచోట్ల గానవచ్చును. కుంతి (1-186నుండి 199), భీష్ముడు (1 - 221), సనకాదులు (3-541 నుండి 548) అక్రూరుడు (10పూ 1232), ముచుకుందుడు (10పూ 1652 నుండి 1661) బ్రహ్మాది దేవతలు (7-306 నుండి 338 మరియు 10-89 నుండి 101) మొ॥వారు శ్రీమన్నారాయణుని ప్రస్తుతించుట గలదు.

పోతన్నగారు హరి నామకీర్తన అన్నిటికన్న శ్రేష్ఠమైనదిగా తలంచినట్లు దోచును. అవతారికలో—

"తే చేతులారంగ శివునిఁ బూజింపఁదేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁదేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁదేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు"          (1-12)

ఇంకను హరినామ కీర్తన వైశిష్ట్యమునాతడు భాగవతంలో పెక్కుచోట్ల వ్యక్తీకరించెను.

"సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"     (7-169)

వంటి సుప్రసిద్ధ పద్యములలో కీర్తన మాహాత్మ్యము వెల్లడింప బడినది.

"క. గోవింద నామ కీర్తనఁ
గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి
త్రీ విభుఁడు మూఁ గొనియెను
గైవల్యము దొల్లి రెండు గడియలలోనన్" (2-11)

అని శుకమహర్షి కీర్తన భక్తి విశిష్టతను వెల్లడించెను

మున్నెన్నడు హరిభక్తి యెరుగని అజామీళుడు అంత్యకాలమున యమదూతలను గని భయకంపితుడై తన కుమారుడైన నారాయణుని 'నారాయణ' యని ముమ్మార్లు పిలిచెను. అది విన్న విష్ణుదూతలేతెంచి అతనిని యమభటులనుండి విడిపించిరి. తెలిసి యైనను తెలియకపోయినను హరికీర్తన గావించువాడు ఆపదల బొందజాలడు.

"క. హరి నెఱుఁగని యా బాలుడు
హరి భక్తులతోడఁ గూడి హరి యనువాఁడున్
సరియై దోషము లడఁచును
గరువలితో నగ్నితృణముఁ గాల్చిన భంగిన్"
(6 - 124)

అని విష్ణుభటులు యమదూతలతో ననిరి. ఇట్టిది హరి నామకీర్తన మాహాత్మ్యము.

స్మరణమనగా భగవంతుని స్వరూపాది విషయజ్ఞానము కలిగియుండుట యని వీరరాఘవాచార్యులు వివరించిరి. శ్లోకంలో స్మరణభక్తికి ప్రహ్లాదుడు పేర్కొనబడినాడు.

"వ ...సద్గుణ గరిష్ఠుండైన ప్రహ్లాదుండు భగవంతుండైన వాసుదేవునియందు సహజ సంవర్థమాన నిరంతర ధ్యానరతుండై" (7-120) అని భాగవతంలో అతని హరిభక్తి సహజసిద్ధమైనదిగా తెలుపబడింది.

"సీ. అడుగడ్గునకు మాధవాను చింతన, సుధా మాధుర్యమున
మేను మఱచువా (7-160)"

డితడు ఇంకను

".. మాతృగర్భముఁ జొచ్చి యున్నది మొదలుగా జిత్త మచ్యుతు
మీఁదఁ జేర్చువా (7-160)"డు.

ప్రహ్లాదుడు తండ్రితో—

కం. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థ ముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ (7-166)

అని పలికెను. అతడు చదివిన చదువులలోని మర్మమంతయు, "చక్రి చింతలేని జన్మంబు జన్మమే" (7-170) యనునది యగుట స్పష్టము నిరంతర హరి చింతనాపరుడైన కారణమున, "అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గెల్వ సమర్థంబులు"(1-365) గాలేదు.

"నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే? ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనామృతము లేక" (7-171)

అని ప్రహ్లాదుడు నుడివెను. ఈ విధముగ భాగవతము స్మరణ భక్తిని నిర్దేశించుచున్నది. దీనినే పోతన్న చింతనమని పేర్కొని నవవిధ భక్తులలో తుదిమెట్టుగా దీనిని గ్రహించెను. హరిభక్తికి హరి చింతనము పరమావధి యని పోతన్నగారి యుద్దేశమై యుండును.

శ్లోకంలో పాదసేవనమునకు లక్ష్మీదేవి ఉదాహృతురాలయ్యెను. పాదసేవనమన పాదసంవాహనమని వీరరాఘవాచార్యులు వివరించిరి.

"కం. పావనములు దురితలతా
లావనములు నిత్యమంగళ ప్రాభవ సం
జీవనములు లక్ష్మి సం
భావనములు వాసుదేవ పదసేవనముల్" (1-443)

శ్రీహరి పాదము లెప్పుడును 'లక్ష్మి సంభావనములై' వెలసియుండుటను భాగవతము స్మరించినది.

భూదేవి యొకచోట—

"కం. వారి పాదంబులు సోఁకెడి
సిరి కతమున నఖిల భువన నేవ్యత్వముతో
స్థిరనైతి నిన్ని దినములు
హరి నా గర్వంబు మాన్పి యరిగె మహాత్మా"
(1 - 404)

అని హరి పాదసేవన మాహాత్మ్యము నుగ్గడించెను.

పృథు చక్రవర్తి శ్రీహరిని సేవించుటలో ఇందిరతో సమానమైన భక్తి గలవాడుగా భాగవతంలో గనిపించుచున్నది. పృథువు విష్ణుమూర్తితో—

".... ఉత్సుకమతినైన యేను లక్ష్మి
కరణి నిన్ను భజింతునో పరమ పురుష!

"వ. ఇట్లు భవదీయ సేవాతత్పరులమైన ఇందిరయు నేను నేక పదార్థాభిలాషం జేసి స్పర్థమాను లగుచున్న మా

యిద్దరికిని౯ బర్యాయ సేవం జేసి కలహ బు లేకుండ నిమ్మట్లు గాక భవదీయ చరణ సరోరుహ సేవాసక్త మనో విస్తారుల మగుటంజేసి నేను నేన మున్ను భజియింతునను తలంపులం గలహంబైననుం గానిమ్ము." (4-555, 556) అని ప్రార్థించెను. పృధువు విష్ణు పాదసేవలో లక్ష్మీదేవితో స్పర్థించుటకును ఇష్టపడుచున్నాడు. భగవంతుడు భక్త పరాధీనుడు కాబట్టి పృధువును జూచినట్టి కరుణాదృష్టితో ఇందిరను జూడడట (4-557)

పాద సంసేవన మహిమ ఇట్టిది.

మధురానగరంలో మాలాకారుడైన సుదాముడు శ్రీకృష్ణుని—

"కం. నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును, నితాం
తాపార భూతదయయును
దాపస మందార! నాకు దయ సేయఁగదే"
(10పూ 1268)

అని ప్రార్థించెను.

ఇంకను భాగవతంలో అక్రూరుడు, ఉద్ధవుడు మున్నగు వారు శ్రీహరి పాదసంసేవన నిరతులు

అర్చనకు పృధు చక్రవర్తి ఉదాహృతుడైనాడు. ఇతడు విష్ణుమూర్తిని యజ్ఞపురుషునిగ జేసి 99 అశ్వమేధ యాగముల గావించెను నూరవ అశ్వమేధము ఇంద్రుని వలన విఘ్నమయ్యెను అయ్యెను విష్ణుమూర్తి ఇతని భక్తికి మెచ్చి 99 అశ్వమేధ యాగఫలములను ఇచ్చి, మోక్షమార్గమును బోధించి, మరికొన్ని వరముల నిచ్చెను. తుదకు అతడు గావించిన పూజ లందుకొని మరలిపోయెను. (4-558) ఇతడు మోక్షమార్గమును తాననుసరించుటయేగాక తన ప్రజలందరికిని బోధించి వారినంద రిని విష్ణుభక్తులను గావించెను. వాయువును వాయువునందును, ఆకాశము నాకాశమునందును, తేజమును తేజమునందును ఉదకము నుదకమునందును, శరీరమును మేదినియందును గలిపి ప్రాణములను వదలి ముక్తుడయ్యెను.(4-655) ఇది ఇతనియొక్క అర్చన భక్తివలన గలిగిన ఫలము

ఇట్టి అర్చన భక్తి అంబరీషునిలోను గనిపించును. అతడు ద్వాదశీ వ్రతాదులతో ఎల్లప్పుడును శ్రీహరిని అర్చించు చుండును. ఇతని భక్తికి మెచ్చి విష్ణువు ఇతనికి తన సుదర్శనాయుధమును సహాయముగ నిచ్చెను.

వందనమునకు అక్రూరుడు ఉదాహృతుడైనాడు. ధనుర్యాగము పేరు జెప్పి రామకృష్ణులను రప్పించి చంపవలెనని కంసుడు భావించి వారిని తోడితెచ్చుటకు అక్రూరుని బంపెను.

అతడు బలరామకృష్ణులను చూచుటకు ముందతడిట్లు తన మనసులో ననుకొనెను—

"ఉ. మాపటివేళ నేను జని మాధవు పాద సమీపమందు దం
డాధిపతితుండనైన నతఁడారుగ కాల భుజంగ వేగ సం
తాపిత భక్తలోక భయదారణమైన కరాబ్జ మౌదలన్
మోపి హసించి నాకభయమున్ గృపతోడుత నీయకుండునే"
(10పూ 1192)

రామకృష్ణులను దర్శించి—

"క. కని వారల పాదములకు
వినయంబున మ్రొక్కి భక్తి వివశుండగుచున్
దనువునఁ బులకాంకురములు
మొనయఁగ నానంద భాష్పములు జడి గురియన్"
(10పూ 1198)

ఈ విధముగ అతని వందనభక్తి స్పష్టమగుచున్నది. అతని భక్తి పర్యవసానము, భగవంతునికి అతనిపైగల కరుణ ఈ క్రింది సంఘటన వివరించును.

అక్రూరుడు రామకృష్ణులను దర్శించి కంసుడు వారిని తోడి తెమ్మనుటను, అతని పన్నాగమును వారికి వివరించెను రామకృష్ణులు మధురకు వెళ్ళుటకే నిశ్చయించిరి. మరుసటి దినమున అక్రూరుడు వారల దోడ్కొని రథముపై మధురకు బయలుదేరెను దారిలో కాళింది నదినిగాంచి రామకృష్ణులు రథము దిగి జలములు గ్రోలివచ్చిరి. తరువాత అక్రూరుడు వారలకు నమస్కరించి వెళ్ళి కాళిందిలో దిగి స్నానమాచరించెను స్నానమాచరించుచుండగా అతనికి నీటిలో రామకృష్ణులు గనిపించిరి. ఆశ్చర్యపడి చూడగా వారు రథముపైననే నుండిరి. తిరిగి నీటిలో జూడగా వారందు గనిపించిరి ఇట్లు రెండు మూడు పర్యాయములు నీటిలోను, రథముపైనను వారతనికి కగపడిరి. తదుపరి పాపశయ్యపై శయనించిన పరమాత్మ అతనికి దర్శన మిచ్చెను ఆ సందర్భములో అక్రూరుడు గావించిన దండక రూపస్తుతి (10పూ 1232) అతని భక్తిని చాటుచున్నది. ఈ విధముగా అక్రూరుడు తన వందనభక్తిచే పరమాత్మ దర్శనమును పొందగలిగెను.

దాసత్వమునకు హనుమంతుడు పేర్కొనబడెను. ఇతని దాసత్వము, శ్రీరామ పాదసేవార్చనము జగద్విదితము. కాని భాగవతంలో ఈ విషయం అంత స్పష్టముగా లేదు.

శ్రీధరాచార్యులు పాదసేవనమున 'పరిచర్యా' అనియు దాస్యమున 'కర్మార్పణ' మనియు తెలిపిరి. కాని వీరరాఘవులు పాద సేవనమున పాద సంవాహనమనెను. పాద సేవనము, దాస్యము ఇంచుమించు సమానార్థకముగా గనిపించును. శ్రీధరులు దాస్యమున కిచ్చిన కర్మార్పణమను నర్థము సమంజసమే యైనదైనను పైన పాద సేవనమన పాద సంవాహనమను నర్థములోనే గ్రహించితిమిగాన ఇట్లు దాస్యమునకు పరిచర్య యను నర్థమును గ్రహించుట యుక్తమగును. ఇట్టి దాస్యభక్తికి భాగవతంలో ఉద్ధవుని చరిత్రము చక్కని తార్కాణము.

విదురు డొకపరి తీర్థయాత్రలు గావించుచు మాధవుని దర్శింపవలెనని తలంచి యమునను దాటుచుండగా అట ఉద్ధవుడతని కనుపించెను. అతనితో సంభాషించుచు శ్రీకృష్ణుడు కుశలమేనా యని విదురుడతని నడిగెను. అప్పటికే కృష్ణ నిర్యాణమై యుండెను.

అప్పుడా యుద్ధవుడు—

కం. యదు కుల నిధియగు కృష్ణుని
పద జలజ వియోగ తాప భరమున మాటల్
ప్రిదులక హృదయం బెరియఁగ
బెదవులు దడుపుచును వగలఁ బెంపతిలియుండెన్

(3 - 77)

ఉద్ధవునికి కృష్ణునిపైగల భక్తిభావమును వివరించుటకు శుకమహర్షి ఉద్ధవుని అయిదేండ్ల ప్రాయమునాటి ఒక సంఘటనను పరీక్షిత్తునకు వినిపించెను.

"వ. మున్ను కృష్ణునిం గూడి యాడు బాలకులలో నొక్క బాలునిఁ గృష్ణునిఁగా భావించి పరిచర్య సేయుచుండ గుణవతిమ తల్లియగు తల్లి చనుదెంచి యాకొంటి విదియేల రావన్న యని పిలిచిన జననీ వాక్యంబులు గైకొనక యఖండ తేజోనిధియైన పుండరీకాక్ష పాదారవింద సేవానురక్తిం జేసి యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణ వియోగ తాపంబున హరివార్త విదురునకుఁ జెప్పఁజాలక యుండుట యేమి విచిత్రంబు...."(3-79) అని తెలిపెను. ఇట్టిది ఉద్ధవుని భక్తి తాత్పర్య విశేషము.

శ్లోకంలోని సఖ్యభక్తికి అర్జును డుదాహృతుడు. కాని హనుమంతుని దాస్య భక్తివలె కృష్ణార్జునుల సఖ్యమున్ను జగద్విదితము. భాగవతంలో ఈ అంశము స్పష్టీకరింపబడింది.

సఖ్యమును 'తద్విశ్వాసాది' యని శ్రీధరాచార్యులు పేర్కొనిరి. ఇట్టి సఖ్యమునకు కుచేలుని చరితము ఉదాహరణ ప్రాయము.

కుచేలుడు కృష్ణునికి బాల్యస్నేహితుడు. అధిక సంతానంతో, నిత్య దరిద్రంలో ఉండియు హరిభక్తి వీడనివాడు. తుదకు భార్య ప్రోద్బలంతో కృష్ణుని దర్శించి యాచించవలెనని నిశ్చయించుకొనెను. ఈ విధముగనైనను కృష్ణుని కనులారఁ గాంచవచ్చును గదా యతని యాశ. తీరా కృష్ణదర్శనమైనప్పుడు అతడేమియు అడుగజాలకపోయెను. తన గృహమునకు వెళ్ళుచు ఇట్లు తలపోసెను—

ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియు
నీని తెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే

(10ఉ. 1015)

ఈ విధముగా తలపోయుచు స్వగృహమునకేగి వాసుదేవుడు ప్రసాదించిన ఐశ్వర్యమునకు సంతోషించియు నిఖిల భోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును, నిర్వికారుండునునై యఖిల క్రియలయందు ననంతుని యనంత ధ్యాన సుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గ ప్రాప్తినొందె...." (10ఉ 1027)

ఈ విధముగా దారిద్ర్యమునందును, ఐశ్వర్యమునందును ఏకవిధముగ భగవంతునియందు విశ్వాసముంచి కుచేలుడు ముక్తబంధనుడయ్యెను.

నవవిధ భక్తులలో చివరిది ఆత్మనివేదనము. 'సర్వస్వాత్మ సమర్పణే బలిః' అని శ్లోకము.

విష్ణుమూర్తి వామనావతారమెత్తి బలిని మూడడుగుల చోటడిగి తుదకు అతనిని పాతాళమునకు బంపుట యనునది ఎల్లరెరిగిన కథయే. శ్రీమన్నారాయణుడు అవతారము లెత్తుట సాధారణముగా దుష్టజన సంహారము గావించి భూభారమును తొలగించుట. కాని బలి చక్రవర్తి దుష్టుడు కాడు. విష్ణుభక్తుడు.

ఇట్టిచో వామనావతారమేల? భక్తుడైన బలిని భగవంతుడు పాతాళమునకు బంపుట యేల? యను ప్రశ్నలను విష్ణుమూర్తిచే శిక్షార్హుడైన బలి సర్వస్వాత్మ సమర్పణ గావించినవాడగుట లోని సామంజస్యమేమి? అను ప్రశ్నయును సహజముగా ఉద్భవించును.

ఇంద్రాదులు రాజ్యము కోల్పోయి దీనులైయుండగా తల్లియైన అదితి మనసు తల్లడిల్లను భర్తయైన కశ్యపమహర్షి ఆమెను ఊరడించి శ్రీహరిని సేవించుమని పలికి దానికి తగిన పయోభక్షణమను వ్రతమును ఉపదేశించెను. ఆ విధముగా ఆమె వ్రతము నాచరించగా విష్ణుమూర్తి ప్రసన్నుడై ఆమెకు ప్రత్యక్షమై ఇంద్రుని తిరిగి స్వర్గాధిపతిని గావించెదనని మాట ఇచ్చి ఆమెకు పుత్రుడై జన్మించెను. ఇది స్థూలముగా వామనమూర్త్యావిర్భావమునకు కారణము.

ఎన్నో అవతారములలో రాక్షస సంహారము గావించిన విష్ణువు బలి తన భక్తుడు గాన,

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబుల గాని"
అని అనును (8 - 487)

ఇక బలి గుణములలోగాని భక్తిలోగాని అందరికంటె ఘనుడు.

వరుణ పాశముతో బలిని బంధించినప్పుడు బ్రహ్మ ఏతెంచి,

"సీ. ....తోయపూరము చల్లి దూర్వాంకురంబులఁ జేరి నీ పదము లర్చించునట్టి

తే. భక్తియుక్తుఁడు లోకేశ పదమునందు
నీవు ప్రత్యక్షముగ వచ్చి నేఁడు వేఁడ
నెఱిఁగి తన రాజ్యమంతయు నిచ్చినట్టి
బలికిఁ దగునయ్య దృఢ పాశబంధనంబు"

అని పలికెను. (8 - 657)

ఇక భగవంతుడును ఇతనినిగూర్చి ఈ విధముగ పొగిడెను.

"....శుద్ధత్వంబును సత్యమున్ గరుణనే జొప్పేమియుం దప్పడు దృఢుండై యజయాఖ్య మాయగెలిచెం బుణ్యుండితం డల్పుఁడే" (8 - 660)

బలి భగవంతుని గూర్చి

"సీ. .. .. .. .. .....గురువులలో నాదిగురువ వీవ
నీవు బంధించిన నిగ్రహమో లజ్జయో నష్టియో బాధయో
తలంప" (8-644)

నను సంపూర్ణ విశ్వాసము గలవాడు

"సీ చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు కాంతలు సంసార
కారముఞ...." (8-646)

ఇత్యాదిగా వైరాగ్యభావము గలవాడు.

ఇట్టి బలిని అన్యాయముగా విష్ణుమూర్తి పదభ్రష్టుని గావించెనా? కాదు.

"సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛయించితి వాని యఖిల విత్తంబు
నేనపహరింతు" (8-659)

నని వామనమూర్తి పలుకును. అనగా భగవంతుని కరుణా కటాక్షములు బలిపై సంపూర్ణముగ ప్రసరించినవి అష్టమ మనువైన సావర్ణి మనువువేళ ఇతడు దేవేంద్రుడగునని భగవంతుడు దెలిపెను.

గురువైన భార్గవుడును ఇతరులును వలదని వారించినను తన రాజ్యమును తుదకు తనను భగవంతునికి సమర్పించుకొన్న ధన్యాత్ముడితడు. కావున 'సర్వస్వాత్మ సమర్పణే బలిః' అనునది సార్థకమే. భాగవతంలో అంబరీషునిలోను, రంతిదేవుని లోను గోపికలలోను ఈ సర్వస్వార్పణ బుద్ధి గనిపించును. పరమాత్మను భర్తగ సంభావించి మధురభక్తి కలితలైన గోపికల కృష్ణభక్తి లోకప్రసిద్ధమే.

ఈ విధముగా భక్తుడు సంసారమును తరించుటకుగాను, కైవల్యప్రాప్తిని పొందుటకుగాను నవవిధ భక్తిమార్గము సర్వశ్రేష్ఠమైనట్టిది

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!"

"పోయిందే!"




మేలుపరచబడిన అమృతాంజన్ వాడకంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా వుపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్



Amrutanjan Limited

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

OBM 149 TG R

# అభిజ్ఞానం వలె ఉదయం

శ్రీ వ్యాదిరాజు రంగారావు

మినార్ నిల్చి ఉంది ఆదర్శంవలె
ఆకాశం అంచులలో శిఖరంతో,
బిందువు సముద్రంవలె వ్యక్తి సమాజం కలితే
మాట సంగీతంవలె వాస్తవమూ ఆదర్శం;
ఒకప్పుడు పరస్పర కర్షణతో నిలుస్తాయి
ఒకప్పుడు అన్యోన్యం స్నేహంతో కలుస్తాయి.

ఇంటి వెలుపల పచ్చని చెట్టు ఉంది
ఇంటి లోపల వెచ్చని అగ్ని ఉంది.
మనసులో పెరిగే చల్లని చెట్టు ఉంది
వేళ్ళలో సన్నని సెగతో అగ్ని ఉంది.
చెట్టును నరికివేసేవారు ఉన్నారు
అగ్నిని బుగ్గి చేసేవారు ఉన్నారు.

కాలాన్ని వెంట ఈడ్చుకొని
మినార్లు చెట్లు ఇండ్లు దాటి,
కదిలేను జీవితం సమాజంలో
విరుద్ధ శక్తుల మధ్యలోనుండీ,
బిందువు బిందువునుండి రేఖలుగా
చర్యలతో చరిత్రను నిర్మిస్తూ.

ఆలోచన సంస్కారం ఉంటే ఉండవచ్చు
ఆందోళనలో అశాంతి వచ్చే దారి వేరు,
సంస్కారం లోపించి చెట్లను కొట్టేయవచ్చు
అజ్ఞానం ఎక్కువై పూలను మండించవచ్చు
మినార్ శిథిలమైపోవచ్చు విషాదగాథలో
నిల్చేది మనిషే! సామాజిక శక్తి పదంతో

ఉదయం వాలుతుంది ఎంతో ప్రేమతో
ముఖాన పుష్పమై ఆనందబింబమై
ఎదపై కదులుతుంది సువర్ణ పత్రమై
ఆ పైన చేతిలో కరెన్సీ రూపమై,
మేల్కొన్న వారందరు ఈ సమయాన్ని
ఆలోచనా శ్రేణికగా తలచేరు,

అప్పుడప్పుడు కోపంతో రంజితమై
హింసతో ప్లావితమై రక్తిలమై
పేదరికంతో శూన్యమైన రూపాలూ
పేలికలూ మాసికలతో అనగ్నంగా
ఎవరు చూచినా చూడకపోయినా
రోజు వస్తుంది కొత్త విలువలతో.

ఉదయం లేవడం ఆలస్యమైతే
సుతీక్ష్ణమైన కిరణం ఎదురౌతుంది
పైకి చూచేందుకు వీల లేకుండ ఉంటుంది
నేలపై చూపులతో జనం! పనీపాట్లతో;
అరచేయి గీతల్లో స్వేచ్ఛ ఎరుగని జీవితం,
చీలే కాంతి జాతులనుండి హైవే! అదృష్టం!

దుష్యంతుని అభిజ్ఞానం ఉంగరంవలె
జ్ఞాపికయై కళ్ళు తెరపిస్తుంది ఉదయం
ఇది నిశాముక్తమైన సమయం
హృది పుష్పమైంది సువర్ణమైంది,
ప్రయాణంలో ఆపై కరెన్సీ ఔతుంది
మరో ఉదయంవరకూ చెల్లుతూ విపణిలో.

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

**ఫిబ్రవరి – 1989**

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి నెలంతా వ్యవహార విజయం, సంఘంలో గౌరవ ప్రతిష్ఠలు, బంధుమిత్రాదుల సమాగమం మొదలగునవి బాగుగా నుండును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును ఉద్యోగంలో అభివృద్ధి కలుగును. గృహ నిర్మాణ ప్రయత్నములు ఫలించును. కుటుంబ సంసారసౌఖ్యం బాగుగా నుండును. రాజకీయవాదులకు, వర్తక, వ్యవసాయదార్లకు మంచి లాభము కలుగును. అనేక విధముల ధనము కలసివచ్చును అయితే శరీరశ్రమ మాత్రం అధికంగా నుండును.

భరణివారికి 22 తేదీవరకు శరీరంలో శ్రమ, అధికవేడిమి కలుగును. ధనవ్యయం అధికంగా జరుగును గతంలోని ఒడుదొడుకులు తగ్గినా, శుభకార్య ప్రయత్నాలు, వ్యవహారాల్లో ప్రతిష్ఠంభన, ఏవో చిన్న చిన్న కారణములచే మనఃఖేదం కలుగును. వ్యవహారములలో పూర్తి పరిష్కారముగాని, ప్రతిఫలముగాని రాదు ఆశ మాత్రం పెరుగుతూ ఉండును ఉద్యోగులకు మంచి అభివృద్ధి, విద్యార్థులకు అనుకూలత కలుగును.

కృత్తిక 1పా. వారికి భార్యా కుటుంబ సంసారసౌఖ్యం, ఉద్యోగంలో అభివృద్ధి కల్గును. ప్రమోషను కలుగును ఏదో విధంగా రాబడికి లోపముండదు. ప్రతి పనిలోను అధికశ్రమ, అల్పఫలము కలుగుచుండును. సంతానమునకు విద్యాభివృద్ధిలో బాగుగా రాణించును. 23 తేదీనుండి శరీరశ్రమ, వేడిమి హెచ్చగును. మొత్తంమీద ఈ నెలంతా శ్రమ కలిగినను బాగుగానే నడచును.

**వృషభం** (కృత్తిక 2, 3, 4పా రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా. వారికి శ్రమ, చిక్కులు, ధనవ్యయం, ఆర్థికంగా ఒడుదొడుకులు మొదలగునవి కలిగినను, ఆదాయం బాగుగా నుండుటవలన, మాట పలుకుబడివలన ఏదో విధముగా చిక్కులనుండి గట్టెక్కగలరు. అయితే కుటుంబంలో కొన్ని కలతలు, మాటపట్టింపులు తరచుగా ఉండును. వచ్చిన ఆదాయమంతయు పనికిమాలిన ఖర్చుక్రిందనే సరిపోవును. ఉద్యోగంలో అభివృద్ధి కలుగును చివరివారంలో శ్రమ హెచ్చుగా నుండును

రోహిణివారికి ఏవో చిన్న చిన్న ఒడుదొడుకులు కలిగినను, అన్నివిధముల ఆదాయము, సంఘంలో గౌరవము, ఉద్యోగంలో అభివృద్ధి, బుద్ధికుశలత, సమయోచితముగా గడుపు కొనిపోగల నేర్పు, మొదలగువానిమూలకంగా అన్ని పనులను సాధించుకొనకలుగుట జరుగును. సుఖసంతోషములు వృద్ధి పొందును. ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు మంచి లాభసాటిగా నుండును.

మృగశిర 1, 2పా. వారికి శరీరశ్రమ, అనారోగ్యం, త్రిప్పట, ధనవ్యయం, బంధువిరోధము, ప్రతి విషయములోను ఆందోళన కలుగును భార్యా వర్గంవారితో అభిప్రాయభేదములు, మాటపట్టింపులు వచ్చును. 22 తేదీవరకు సౌఖ్యభంగము, వేళకు నిద్రాహారము లుండవు శరీరంలో వేడిమి హెచ్చుగా నుండును. సంతానమునకు నలత చేయును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగుచుండును. అధిక శ్రమ కలుగును.

**మిధునం** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3పా)

మృగశిర 3, 4పా వారికి 22 తేదీవరకు శరీరశ్రమ, ఉష్ణాధిక్యము, ధనవ్యయం కలిగించును. భార్యకు అనారోగ్యము చేసి నిమ్మళించును. కుటుంబంలో కలతలు, నలతలు హెచ్చుగా నుండును. శుభకార్య విఘ్నములు, మనఃఖేదం, ప్రతి విషయం లోను అడుగడుగునకు ఆటంకములు కలుగుచుండును. ఉద్యోగులకు, వర్తకులకు, కార్మికులకు, వ్యవసాయదార్లకుకూడా శ్రమకు తగిన ఫలితము కలుగును

ఆర్ద్ర వారికి, ఏ విషయంలోను లోపము లేకపోయినా, మనస్సునకు ఎల్లప్పుడు ఆందోళన కలుగుచుండును. శారీరకంగా మానసికంగా శ్రమ హెచ్చుగా నుండును. బంధుమిత్రాదుల గురించి, సంతానము గురించి అధికంగా ధనవ్యయం చేయవలసి

వచ్చును. వ్యవహారములలో ప్రతిష్టంభన ఏర్పడును. 7 - 16 తేదీలమధ్య భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. వర్తకులకు, వ్యసాయదార్లకు అన్నివిధముల లాభము కలుగును.

పునర్వసు 1, 2, 3పా. వారికి పెద్దగా ఒడుదొడుకు లుండవు. చెప్పుకోదగిన లాభము ఉండదు. ఏదోవిధముగా కుటుంబ సంసార వ్యవహారములు గడచిపోవుచుండును. 7-16 తేదీలమధ్య శ్రమ, ఆందోళన కలిగించును ఉన్నతాధికారులతో పరిచయము, కొత్త బంధుమిత్రాదులవలన కార్యసిద్ధి, నూతన వస్తు సంపాదనము కలుగును కార్మికులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు, ఉద్యోగులకు మంచి అనుకూలమైన కాలము.

## కర్కాటకం (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా వారికి పెద్దగా యోగముండదు. ధన వ్యయంతో వ్యవహారములు సిద్ధించును 7-16 తేదీలమధ్య శ్రమ హెచ్చుగా నుండును కాని వర్తకులకు, వ్యవసాయదారులకు అన్నివిధాల లాభము కల్గును భూములు, పశువులు, సువర్ణము, ఆహారపు దినుసులు మొదలగువాని క్రయ విక్రయములలో మంచి లాభము కలుగును. సంసారసుఖాభిలాష, సంతానమునకు విద్యారంగములలో బాగుగా రాణించును.

పుష్యమి వారికి ధనలాభం, కార్యవిజయం, ఉద్యోగ వ్యాపారాదులలో అభివృద్ధి, శుభకార్యములలో నిశ్చయము, సంసార కుటుంబసౌఖ్యం, సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. బంధుమిత్రుల రాకపోకలతో సుఖసంతోషాలతో గడచును. అన్ని రంగాలలోవారికి ధనాదాయం బాగుగానుండును. అయినను మొదటి పదిహేను రోజులు శ్రమ హెచ్చుగానుండును. రాజకీయ నాయకులకు మంచి అనుకూలంగా నుండును.

ఆశ్లేష వారికి నెలంతా శ్రమ హెచ్చుగా నుండును. ఫలితం తక్కువగా నుండును. రాజకీయ నాయకులకు బొటా బొటిగా విజయం లభించవచ్చును. విద్యార్థులకు అనుకూలంగా నుండును మొత్తంమీద నెలంతా చిన్న చిన్న ఒడుదొడుకుల తోను, ఆందోళనతోను, శరీరశ్రమతోను గడచును. మనస్సు ఆందోళనతోను బాధపడును శుభకార్య ప్రయత్నములకు ఆటంకము కలిగి వాయిదా పడుచుండును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1పా)

మఘ నక్షత్రంవారికి నెలంతా కార్యవిజయం, ఉద్యోగ వ్యాపారాదులవలన ధనలాభము, బంధుమిత్రాదుల రాకపోకలచే సుఖ సంతోషములు, అన్నివిధముల అభివృద్ధి పొందును. సంసార కుటుంబసౌఖ్యం బాగుగానుండును. దైవపూజలు, పుణ్య ధర్మ కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. వర్తక, కర్షక, కార్మికవర్గాలకు, ఉద్యోగులకు, రాజకీయనాయకులకు కూడ అన్ని విధాల అనుకూలమైన కాలము అయితే శరీరశ్రమ హెచ్చుగా నుండును.

పుబ్బ వారికి నెలంతా అనుకూలగా ఉండును అన్ని విధముల సుఖసంతోషములు వృద్ధిపొందును ధనాదాయం బాగుండును నూతన మిత్రుల పరిచయమువలన కార్యసిద్ధి, ఉద్యోగాభివృద్ధి కలుగును. 22వ తేదీవరకు కుటుంబంలో చిన్న చిన్న కలతలు, నలతలు అనుకొనని పరిణామములు, శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు జరుగును. శరీరశ్రమ, వేడిమి హెచ్చుగా నుండును

ఉత్తర 1పా. వారికి ఇటు కుటుంబ విషయములో, అటు ఆరోగ్య వ్యవహారములలో, ఉద్యోగ, రాజకీయాదుల విషయం లోను, శుభకార్య ప్రయత్నములలోను, అనుకూలత తక్కువగా నుండును. విపరీతమైన ధనవ్యయం కలుగును. ఎంత రాబడి ఉన్నా, ధనమునకు తొట్రుపాటు కలుగుచుండును- శ్రమ హెచ్చుగా నుండును. ఉద్యోగులకు, కార్మికులకు, వర్తకులకు, ఉత్తరభాగమంతా విజయం, లాభము, కార్యసిద్ధి, ఉత్సాహం కలుగును. చివరి వారంలో వేడిమి హెచ్చుగా నుండును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4పా. వారికి శుభాశుభ మిశ్రమఫలం కలుగును. మొదటి భాగమంతా సామాన్యంగాను, ఆ పిమ్మట ఉత్తరభాగమంతా ధనలాభంతో గడచును. నూతన వస్తు సంపాదనము జరుగును. బంధుమిత్రుల రాకపోకలు, శుభకార్య ప్రయత్నములు ఫలించును. విద్యా, విజ్ఞాన, ఆధ్యాత్మిక రంగము లలో కృషి ఫలించును. చివరి వారమంతా శరీరంలో వేడిమి హెచ్చుగా నుండును.

హస్త వారికి శరీరశ్రమ, మానసికంగా వ్యథ కలుగును. ధనాదాయం బాగుండును శుభకార్య ప్రయత్నములు ఫలించును. రాజకీయ నాయకులకు మంచి అనుకూలంగానే ఉండును ఆరోగ్యం చక్కగానుండును వ్యవసాయ, వ్యాపారరంగములలో అభివృద్ధి కలుగును. సంతానమునకు అన్నివిధముల విద్యా రంగములలో బాగుగా రాణించును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. సర్వవిధాల ఆర్థికలాభం చేకూరును.

చిత్ర 1, 2పా. వారికి 22 తేదీవరకు భార్యకు స్వల్పంగా నలత, శరీరంలో అధికవేడిమి కలుగును. కార్యసిద్ధికై అధికారులు, పెద్దలు అయినవారి అండదండలను బాగా వినియోగించుకోగలరు. తర్వాత నెలంతా ఈ నక్షత్రంవారికి శారీరక-మానసిక శ్రమ అధికమగును ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు, రాజకీయ నాయకులకు బాగుగా లాభించును.

## తుల (చిత్ర 3, 4 పా స్వాతి, విశాఖ 1, 2, 3 పా)

చిత్ర 3, 4పా. వారికి 22 తేదీవరకు శరీరశ్రమ, అధిక వేడిమి కలుగును భార్యకు స్వల్పంగా నలత చేయును. భూగృహాది వ్యవహారములలో స్వల్ప చిక్కులు తటస్థించును. కుటుంబంలో స్వల్పంగా నలత చేయును. సోదరవర్గంతో కించిత్తు మాటపట్టింపులు వచ్చును. 17-21 తేదీలమధ్య స్వల్ప సుఖాలకు అంతరాయం. కార్యములన్నీ వాటంతట అవే ఆలస్యముగా జరిగి వాయిదా పడుచుండును రాజకీయాల వత్తిడి హెచ్చగును.

స్వాతి వారికి బడలిక, త్రిప్పట కలిగి విశ్రాంతి తక్కువగా నుండును. చివరి వారంలో భార్యకు స్వల్పంగా అనారోగ్యంచేసి నిమ్మళించును. కుటుంబంలో అకారణంగా వాగ్వాదములు జరుగును. రాజకీయ నాయకులకు బాగుగా లాభించును. వర్తకులకు, వ్యవసాయదారులకు విశేషంగా ధన లాభం కలసివచ్చును. ఆత్మీయులతో విరోధం కలుగును. ఈ నక్షత్రం గలవారందరికి శుభాశుభ మిశ్రమఫలం కల్గును.

విశాఖ 1, 2, 3పా. వారికి అనేకవిధముల ధనలాభం కలసివచ్చును. వాతావరణం అంతా అనుకూలంగా మారును. కుటుంబంలో సుఖసంతోషములు కలుగును. వివాహాది శుభ కార్యములు నెరవేరుచుండును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. రాజకీయవాదులకు, వర్తకులకు అతి ధీమా, వాక్పారుష్యం మంచిది కాదు. నిర్లక్ష్యంవల్ల కొన్ని కార్యములు చేయిజారి పోవుచుండును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి స్వల్పంగా శరీరశ్రమ కలిగినా, నెలంతా శుభయోగప్రదంగా నుండును. విశేష ధనలాభం, సర్వ కార్యసిద్ధి, గృహ నిర్మాణ ప్రయత్నాలు ఫలించును. సంఘంలో మాట పలుకుబడి పెరుగును. విశేష ప్రయత్నం చేయకుండానే పనులన్నీ జరిగిపోవుచుండును. వ్యవసాయ, వాణిజ్య, శ్రమ జీవులకు బాగుగా కలసివచ్చును. రాజకీయవాదులకు విజయం చేకూరును 7-16 తేదీలమధ్య భార్యకు, స్వల్పంగా నలత, శరీరశ్రమ కలుగును

అనూరాధ వారికి 21 తేదీవరకు శ్రమ, బడలిక, త్రిప్పట కలుగును. శుభకార్య ప్రయత్నాలవల్ల శ్రమ అధికం. గతంలోని ఒడుదొడుకులన్నీ పూర్తిగా తొలగిపోయి, అన్ని రంగాలలోను ఉత్సాహం, కార్యసిద్ధి, జయం, ధనలాభం, తిరిగి బంధువులతో క్రొత్త సంబంధాలు, ఇంతవరకు దూరంగా ఉన్న మిత్రులు తిరిగి దగ్గఱకు చేరబారుట, జరుగును కుటుంబంలో సుఖ సంతోషాలు పెరుగును.

జ్యేష్ఠవారికి ఆరోగ్యం చక్కగా నుండును ధనలాభం బాగుండును. శుభకార్య ప్రయత్నాలు నెరవేరును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును రాబడికి మించిన ఖర్చులు పెరుగును. ఉద్యోగంలో అభివృద్ధి కలుగును. పుణ్య ధర్మ కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. వర్తకులకు, వ్యవసాయదార్లకు కూడ, రాజకీయ, వాణిజ్య, విద్యారంగాలలో నున్నవారందరికి అన్నివిధాల మంచి విజయం, ఉత్సాహం, లాభము కలుగును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా)

మూల వారికి నెలంతా శుభాశుభ మిశ్రమఫలం కలుగును. శుభకార్య ప్రయత్నములకై అధికశ్రమ కలుగును. కాని ధనమునకు లోపముండదు. బంధువులతో స్వల్పంగా మాట పట్టింపులు వచ్చును. ఎంత ధనము వచ్చుచున్నను చేతిలో నిల బడదు. పనికిమాలిన క్రిందనే ఖర్చు జరుగును. ఉద్యోగులకు అభివృద్ధి కలుగును. రావలసిన ప్రమోషను కొంచె మాలస్యమగును. కుటుంబ సంసారసౌఖ్యం కలుగును. వర్తకులకు, వ్యవసాయదార్లకు శ్రమమీద ఫలితం కొనసాగును. అయితే శరీర శ్రమ హెచ్చుగా నుండును.

పూర్వాషాఢ వారికి కుటుంబంలో కలతలు నలతలు హెచ్చుగా నుండును. భూ గృహ వ్యవహారాదులలో చిక్కులు, ధనవ్యయము హెచ్చుగా నుండును. ఆత్మీయులతో విరోధము కలుగును వృత్తిలో అనవసర వ్యయము జరుగును. రాత్రిం బగళ్ళు పనికిమాలిన ఆలోచనలతో, గాలిమేడలతో కాలము గడచును. శరీరంలో నలత, శ్రమ హెచ్చుగా నుండును వేళ పట్టున నిద్రాహారము లుండవు. వర్తకులకు, వ్యవసాయదారులకు సామాన్యస్థితి కలుగును.

ఉత్తరాషాఢ 1పా.వారికి తరచు ఆరోగ్యభంగము, బంధు మిత్రులతో తగాదాలు, అనుకొన్న పనులకు ఆటంకములు, అధికార్లతోను, లేదా, ఊరివారితోను వ్యర్థముగా తగవులు పెరుగును 17 తేదీవరకు శరీరశ్రమ, భార్యకు స్వల్పంగా నలత కలుగును పైవారి బాధ్యతలలో తలదూర్చి, పనికిమాలిన పనులను నెత్తిన వేసికొని బాధపడవలసి వచ్చును ధనాదాయం వచ్చిన వెంటనే క్షణములోనే దానిని మించిన వ్యయముకూడ జరుగును

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4పా శ్రవణం, ధనిష్ట 1. 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4పా వారికి ప్రతి పనిలోను ఒక్కసారికి బదులు పదిసార్లు తిరుగవలసివచ్చును ఎప్పటికప్పుడే కార్యము ఫలించినట్లు అనిపించి, వెనుకకు పడిపోవుచుండును. సోదరవర్గంతో విరోధము కలుగును ఆదాయమునుమించి వ్యయం జరుగును. రాజకీయ, వ్యాపార, వృత్తి రంగాలలో నున్నవారికి అనుకూలమైన కాలము 23 తేదీనుండి శరీరశ్రమ అధికంగా ఉండును

శ్రవణమువారికి అన్నివిధముల అభివృద్ధి కలుగును ఆరోగ్యం చక్కగా నుండును సోదరవర్గంతో అనుకూలత కలుగును సాటి బంధువులతో అభిప్రాయ భేదములు కలుగును. గతంలో జరిగిన చెడు ఫలితములు తొలగిపోయి, వివాహాది శుభ కార్య ప్రయత్నములు ఫలించును అన్ని వర్గాలవారికి శుభ దాయకమైన కాలము రాజకీయవాదులకు విజయం కలుగును. అయితే శ్రమ హెచ్చు ధనవ్యయం అధికంగా జరుగును

ధనిష్ట 1, 2పా. వారికి 22 తేదీవరకు శ్రమ, వేడిమి, సౌఖ్యభంగము మొదలగునవి కలిగించును. శుభకార్యములకు ఆటంకములు కలుగుచుండును. కుటుంబంలో కలతలు నలతలు హెచ్చుగా నుండును ఆదాయం మించిన వ్యయం జరుగును రాజకీయవాదులకు, వర్తకులకు, కార్మిక, కర్షకులకు శ్రమతో కూడిన ఫలితము కొనసాగును. అయితే శ్రమ హెచ్చు. సుఖము తక్కువ మొదటివారంలో భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును.

**కుంభం** (ధనిష్ట 3, 4 పా శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ట 3, 4పా. వారికి శుభాశుభ మిశ్రమఫలం కలుగును. ధనవ్యయం హెచ్చుగా జరుగును. ఉద్యోగులకు ప్రమోషను వచ్చి తప్పిపోవును. శుభకార్య ప్రయత్నాలకు ఆటంకము జరుగును 22 తేదీవరకు శరీరంలో అధికవేడిమి కలుగును మానసికంగా ఆందోళన హెచ్చుగా నుండును పనులన్నీ జరిగిపోవుచున్నట్లు కనపడును, కాని సకాలంలో ఫలించక వాయిదా పడును. శ్రమ హెచ్చుగా నుండును

శతభిషం వారికి శరీరశ్రమ హెచ్చు. పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగా నుండును. మితిమీరిన ధనవ్యయం జరుగును తరచు ఆరోగ్యభంగము కలుగుచుండును ఏ అనారోగ్యం లేకపోయినను, ఏదో చిన్న అస్వస్థతతో బాధపడుచున్నట్లు అనిపించును భార్యకు నలతచేసి నిమ్మళించును. నెల చివరివారంలో అధికవేడిమి కలుగును మొత్తంమీద శ్రమ హెచ్చుగాను, సుఖము తక్కువగా నుండును శుభాశుభమిశ్రఫలం కలుగును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి 18-28 తేదీలమధ్య శరీరంలో నలత, శ్రమ కలుగును ఆర్థికంగా బాగుగానే ఉండును అన్ని వ్యవహారములలో విజయం కలుగును వ్యయం జరిగినా, అది మంచి ఫలితానికి దారితీయును సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు కలుగును. తలకు మించిన పనులు దైవికంగా తలపెట్టుట జరిగినను, వీలయినంతవరకు అన్నింటిలోను విజయం సిద్ధించును ఉద్యోగులకు, వర్తకులకు, వ్యవసాయదారులకు మంచి లాభసాటిగా నుండును

**మీనం** (పూర్వాభాద్ర 4పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి 18-28 తేదీలమధ్య సౌఖ్యభంగము, ధనలాభం, సంఘంలో పలుకుబడి, గౌరవము కలుగును. రాజకీయవాదులకు విజయం కలుగును వర్తకులకు, కార్మిక, కర్షకులకు అన్నివిధాల అభివృద్ధి కలుగును విద్యార్థులకు మంచి ప్రోత్సాహకరంగానే ఉండును. ఇతరుల పనులు కూడ నెరవేర్చి ఎందరికో సహాయపడుట జరుగును. అయితే శరీరశ్రమ హెచ్చుగా నుండును.

ఉత్తరాభాద్ర వారికి 5-18 తేదీలమధ్య శ్రమ కలిగినా, అనుకొన్న పనులన్నీ నెరవేరుచుండును శుభకార్యప్రయత్నాలు ఫలించును. అనేకవిధముల ధనము కలసివచ్చును సద్గోష్ఠి, బంధుమిత్ర సౌఖ్యం, దైవపూజా కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. ప్రయాణములు బాగుగా లాభించును వర్తకులకు, నువ్వులు, చింతపండు, నూనె, ఇనుము మొదలగువానివలన లాభము బాగుగా కలసివచ్చును.

రేవతి వారికి 19-28 తేదీలమధ్య శరీరశ్రమ హెచ్చుగా నుండును మితిమీరిన ధనవ్యయం జరుగును. పొగడ్తలకు పొంగిపోయి, ప్రతివారిని నమ్ముటవలన చిక్కుల నెదుర్కోవలసి వచ్చును. అందరు తమ తమ పనులకై మాటలాడుచు ప్రలోభములు చూపించెదరు కాని క్రియ వచ్చునరికి అందరు తప్పుకొందురు. మొత్తంమీద ఆదాయం బాగున్నను, శ్రమ హెచ్చుగాను, సుఖం తక్కువగా నుండును అయినా మాట పలుకుబడి వలన, ధనాదాయం వలన అన్నింటిని తట్టుకొనగల శక్తి ఉండును

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

# జనార్దనీయం

## శ్రీ ఏలూర్చారి విజయరాఘవరావు

బాగా చీకటి పడింది. గుడి గుమ్మంముందు కుక్కలరుస్తున్నై.... ఆ రోజు అర్చనలో దొరికిన పండ్లూ, కాసులూ కూడేసుకుని మామూలు ప్రకారం మంత్రాలు వల్లించుకుంటూ కొంప జేరుకున్నాడు పూజారి...

ఆ జనార్దనస్వామి దేవాలయం వూళ్ళో అన్నింటికన్నా పురాతనమైన గుడి.అనాదిగా ఆ వూరి వాళ్ళకాయన కులదైవం. చెప్పుకోదగ్గ పెళ్ళిళ్ళూ, పేరంటాలూ-పూజలూ, పునస్కారాలూ-అన్నీ స్వామి సమక్షంలో జరగాల్సిందే.... ఏ ఘటన ఘటించినా ఆయన మహిమే.... అక్కడివాళ్ళ జీవితాలన్నీ ఆయన చేతిలో తోలుబొమ్మల్లా నటన సాగిస్తూ కాలం గడుపుతాయి........ సోమయాజులగారి రూపాయి లాటరీ టిక్కెట్టుతో రూకలవర్షం గురిసి, ఇనప్పెట్టె నిండిపోయింది! పాపయ్యగారి మనవడు పావలా జేబులో లేకున్నా, ఇంట్లోంచి పారిపోయి పట్టున నాలుగు నెల్లయినా కాలేదు — దూబాయ్‌లో జేబులు నింపుకుంటున్నట్టు తాజా వార్త! - అంతేకాదు.... వరదల్లో మునసబుగారి కొంప మునిగిపోయినా, కొత్త కలెక్టరొచ్చి కరణంగార్ని బర్తరఫ్ చేసినా, పరబ్రహ్మంగారు "కొడుకు" కోసం మొక్కుకుంటే "కూతురు" పుట్టినా, తమ్ముణ్ణి "డాక్టరీ" చదివించాలని ఉవ్విళ్ళూరుతుంటే, వాడు కాస్తా సైన్యంలో భర్తీ అయినా, అంతా ... అంతా.... ఆ జనార్దనుడి ఇచ్ఛానుసారమే.... తమ చేతిలో ఏముంది మరి!

ఎందరో భక్తులు రామరాజ్యాని కాశలు పూరించుకుని, కాళ్ళకు బలపాలు కట్టుకుని దూరాతిదూరంనుంచి రోజూ వస్తారు. కోరికల భారంతో, రాతి విగ్రహంచుట్టూ పదే పదే ప్రదక్షణాలు చేస్తూ వలలో రంధ్రాలన్ని కలలు కంటుంటారు!

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన
యత్పూజిత మయాదేవ పరిపూర్ణం తథాస్తుమే....

అంటూ - జన్మంతా చేసిన పాపాలన్నీ ఒక్క క్షణంలో ప్రక్షాళన జేసుకుని, మడిగట్టుకుని, గంపంతాశతో దేవుడికి మొక్కుకుని, మళ్ళీ మర్నాడు తమ దైనందిన కర్మల్లో లీనమవడాని కిపాటికిండ్లకు జేరుకుంటారు. ..

మళ్ళీ ఎలక్షన్లొచ్చిందాకా పిట్ట వాలదని తెలిసి కూడా ఎందరో మహానుభావుర్ని ఎం.ఎల్.ఏ లుగా చేసిందా వూరు! అయినా ఎలక్ట్రిసిటీకింకా నోచుకోలేదు పాపం! చీకటిపడితే జనం వొత్తిడి నమిసిపోతుంది.... కిరసనాలు దీపాలతోనే కాలక్షేపం....అంచేత తెల్లవారేదాకా ఆ దేవుడికి దేవుడే సాక్షి!

గుడి గుమ్మంముందు కుక్కలరుస్తూనే వున్నై!....

అప్పుడొచ్చారు వీళ్ళిద్దరూ — విశ్వనాధం, సావిత్రి.... బాజాభజంత్రీలు లేరు. బ్రాహ్మణమంత్రాలు లేవు. తాళిబొట్టు అభావ్యం లేకుండా దారంతో పసుపుకొమ్ములు కట్టుకుని, జీవితమంతా తన్ను "విశ్వనాధం భార్య"గా మార్చిన "పెళ్ళి" క్షణంలో ముగిసింది సావిత్రికి! ఏ శ్రీమంతుడో పెళ్ళి చేసుకుంటే నవరాత్రోత్సవాల్లాగా గుళ్ళో బ్రహ్మాండంగా వూరేగింపులూ, విందులూ - నాటకాలూ, పాటకచ్చేరీలూ స్థానిక ఎం.ఎల్.ఏ గారి ఆధ్వర్యంలో జరిపేవారేమో! ఇలాంటి పీకులాట గొడవలెవరికి కావాలి మరి! ఈ దౌర్భాగ్యుల పెళ్ళి గొడవెవరికి పట్టుంది గనక! - అయినా అదీ ఒక మేలే అయిందీ నూత్న దంపతులకు-సణుగూ షణుగూ లేకుండా ఆ మూడు ముళ్ళూ పడితే బాగుంటుందనుకున్నారు గనక ...

కానీ....

పెళ్ళంటే పెళ్ళే మరి!! అగ్నికణాలో, ఆనందబాష్పాలో, సావిత్రి కళ్ళల్లోంచి దేవుడి విగ్రహంముందర 'జల జలా' అశ్రువులు రాలినై . . ఆ స్వాతివానకు ముత్యపుచిప్పలు రెండే రెండు—

విశ్వనాధం కళ్ళు.

చేతిలో కాణీ లేకపోయినా గుండె నిబ్బరానికి తక్కువ లేదు.

అతను సావిత్రితో రీవిగా నొక్కి చెప్పాడు "నేనున్నన్నాళ్ళూ నువ్వేమీ దిగులు పడనవసరంలేదు పండూ నన్ను నేను అమ్ముకునైనా నాలుగు గింజలు సంపాయించి నీకు కష్టం రాకుండా కడుపు నింపుతాను ... లోకం కాకులని నీకు తెలుసు కదా.... ఏవో రెండు ప్రాణాలు ప్రేమపాశంతో బంధింపబడ్డాయన్న వార్త వింటే నోటికొచ్చిన తిట్లన్నీ తిట్టుకుంటారే తప్ప "ఇదుగో సావిత్రీ — ఇదుగో విశ్వం — యీ నాలుగణాలూ మా తరపున పెళ్ళికానకగా పూలో కాయలో కొనుక్కోండర్రా" అని చెప్పగల మొగవాడొక్కడైనా వున్నాడా యీ పొలిమేరల్లో! అయినా ఆ జనార్దనుడి చలవ కావాలిగాని వీళ్ళంతా ఏమనుకుంటే మనకేం! - నువ్వే చెప్పు పండూ ..."

ఏమంటుందావిడ మాత్రం? ప్రేమ గుడ్డిదంటారు గుడ్డిదో కుంటిదోకాని విశ్వనాథం తన్ను ప్రేమించడమూ, వాడా తప్పకుండా పెళ్ళి జేసుకోవడమూ ఆ రాతి విగ్రహంముందర కలలా గడిచి మరో రెండు రోజులెలాగో మాయమైనై, చెప్పుకోదగ్గదేమీ లేని తన జీవితయాత్రలో....పవిత్రంగా కోరి తెచ్చుకున్న పసుపుకొమ్ముల మంగళసూత్రం తప్ప మరో కొత్తేమీ లేదు...

కానీ.... మళ్ళీ మామూలే. రోజులు 'కట కట' లాడుతున్నాయి. రేపెలా గడుస్తుందో — అన్న యక్షప్రశ్నతో గుండె లదురుతుంటాయి వాళ్ళిద్దరికీ....

పక్క బస్తీలోని అనాధాశ్రమంలో బాల్యం గడిచింది. యవ్వనం రావడం, చెప్పుకోదగ్గ అంకుశం లేకపోవడం కారణమేమో — ప్రేమాయణ మంకురించింది? పెళ్ళి కాకుండానే 'భార్యాభర్తల్లా' వ్యవహరించుకుంటూ వాళ్ళిపూరు చేరుకున్నారు! జనార్దనస్వామి చలవన పంతులయ్యా, పంతులమ్మలా తంతు గడుపుకుంటున్నారేగాని పట్టున పది రూకలైనా వెనకేసుకోలేకపోయారింతవరకూ దైవసాన్నిధ్యంలో పెళ్ళి కావడంతో లోపల పీకుతున్న పాపభీతి మాత్రం పట్టు వొదిలిందిప్పుడు రోజులు మారకపోతాయా - సావిత్రి మాత్రం రోజూ వీలైనంతవరకూ తప్పకుండా గుడికివెళ్ళి స్వామి దర్శనం చేసుకొస్తుంది.

ఒకరోజు;

పక్కింటి పరబ్రహ్మంగారు, తాపీగా, భోజనాలయ్యాక, కర్ర బుచ్చుకుని కరీం జాడీ బీడీ కట్టకోసం కనకయ్య దుకాణంవేపు పోతూ పోతూ, ముఖం ముడుచుకుని కాళ్ళీడ్చుకుంటూ కొంప జేరుకునే విశ్వనాధాన్ని కలుసుకున్నాడు.

"ఏరా విశ్వం? అంతా ఖులాసా? అట్లా దిగజారుకుపోతున్నావేంటోయ్?!"

"ఏం లేదు మామా.... రోజూ కథే...."

"అంటేః - పిల్లలంతా పారా ఎగ్గొట్టేస్తున్నారా?"

"ఏం చెప్పను మామా - క్షణం తీరిక లేదు.... దమ్మిడీ ఆదాయం లేదు ..."

"అరే అబ్బాయ్! నా మాట విన్నావు కాదు. వూరు కదిలిపోనంటావాయ్! పెళ్ళాన్నిరవైనాలుగు గంటలూ సూదిలో దారంలా మెళ్ళో కట్టుకు తిరగాలా ఏంటి? సైన్యంలో జేరింది నిన్నగాక మొన్న! - జేబులు కారిపోతున్నట్టు డబ్బు పంపిస్తాడు మా తమ్ముడు!! విక్షేపంలాంటి ఉద్యోగంట! కావాలంటే కార్డుముక్క రాస్తాను బాణంలా జవాబొస్తుంది మిలిటరీ వాళ్ళంటే అలా ఖచ్చితంగదూ - మరి.. రిక్రూటింగ్ ఆఫీసర్ కూడా మనవాడే... మా మేనల్లుడికి షడ్డకుడేనోయ్! సావిత్రితో మాట్లాడి ఆలోచించుకో మరి ఎన్నాళ్ళీ "పంతులుగిరీ"తో పీకులాట చెప్పు! ఏమైనా ఆ జనార్దనుడి చలవ కావాలి గదా నీకా కాస్త తెగదెంపులకు ధైర్యమివ్వడానికి!-"

విశ్వనాధం తీవ్రంగా ఆలోచించాడు. ఇన్నాళ్ళూ ఒక యెత్తూ, ఇప్పుడొక యెత్తూ ... తనైతే వాళ్ళు బండ చేసుకుని వచ్చీరాని చదువుతో పాఠాలు వల్లిస్తూ పొట్ట నింపుకుంటాడు గాని, తన మూలంగా ప్రాణానికి ప్రాణమైన సావిత్రి బాధపడ్డం తనకేమాత్రం నచ్చడం లేదీమధ్య. కాని వియోగం సహించగల నిబ్బరముందా

తమలో!! .. పరబ్రహ్మం మామ చెప్పిన మాటల్లో నిజం లేకపోలేదు. అంత ఆప్యాయంగా మాట్లాడే మరో గొంతు తుపాకి గొట్టినా కనపడదూ, వినపడదాయిరి!

"చూద్దాం మరి "..

ఆ జనార్దనుడి అంతరంగంలో అఖిల బ్రహ్మాండాన్ని చిటికిన వేలుపై ఆడించే ఆలోచనఏన్నైవో!! ఊహించుకోవడానికి సావిత్రి దేవత కాదు గదా!

* * *

మెళ్ళో కట్టిన పసుపుకొమ్ము తడి తీరినట్టే లేదింకా కడుపులో పసికందు కలలు గంటున్నది "రంగు రంగుల ప్రపంచాన్ని తనివిదీరా చూడాల"నుకుంటూ...

కలలే—వెయ్యి కలలే—భావికి బంగారపురెకులు పొదిగే కలలే—సావిత్రినీ, విశ్వనాధాన్నీ — తాత్కాలికంగానేమో— వేరు చేయగలిగాయి!

విశ్వనాథం మిలిటరీలో చేరి పట్నం వెళ్ళిపోయాడు.... సమయమొస్తే వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకోవాలి మరి— కాకతాళీయ న్యాయంగా సంభవించిన యీ ఏకాకి జీవితం మరో కొత్త అధ్యాయమీ ఘట్టంలో

గత్యంతరం?

* * *

అప్పుడే మనియార్డర్రొచ్చింది. ఒంటరితనంతో లోలోపల కుళ్ళిపోతున్నా కూడూ గుడ్డకు కరువు లేకుండా మాత్రం కాల చక్రం కదిలిపోతున్నది. కదను తొక్కే సైనికుల కాళ్ళజాడ యే సందులో విన్నా సావిత్రి గుండె అదిరిపోతాయి .. అడుగడుగునా తన విశ్వం జ్ఞాపకమొస్తాడు ... "కాలం మారుతుంది. ఇట్టేపోయి, అట్టే వస్తాడు. 'ఖన ఖనా' మంటూ ఇస్త్రీ మడతలు చెరగని ఖాకీ దుస్తులూ, మగతనపు మీసాలకు చేదోడు వాదోడుగా చేతిలో మాంచి తుపాకీతోసహా 'రాజా'లా నా రాజు తిరిగొచ్చి "సావిత్రీ!" అని నన్ను గుండెలకద్దుకుంటే!!!"

* * *

జనార్దనస్వామి గుళ్ళో సన్నాయిమేళం చెవులారా విని, కడుపు నిండినట్టు కొంప జేరుకుని నాలుగు మెతుకులైనా నవలకుండా పడుకోవడ మీమధ్య అలవాటై పోయిందెందుకో సావిత్రికి.... సన్నాయితానాలు తన అంతరంగంలో సముద్రంలా పొంగి, సంగీతపు కెరటాల్లో సంకేతాలెన్నో స్ఫురిస్తాయి. "విశ్వం వస్తున్నట్టు, బంగారంలాంటి పసికందును తెస్తున్నట్టు!"

ఆ సన్నాయిరవళి మాటుమణిగిందో — నిశ్శబ్దం.... భయంకరమైన నిశ్శబ్దం!– ఆ నిశ్శబ్దంలో దాగిన నిస్సీమిత సంగీతాన్ని మళ్ళీ మళ్ళీ వినడానికి మనసు కొట్టుకుంటుంది! వెర్రి మనసులో నిత్యం వెలుగుతూ వెలుగుతూనే ఆరిపోయే ఆశల దీప నిర్వాణ గంధ మాఘ్రాణించడానికి తాపత్రయపడుతుంది ప్రాణం! ఎన్నెన్నో విచిత్రమైన వూహలతో వెర్రెక్కినట్టుంటుంది రోజంతా!

బహుశా నెలలు తప్పిన ఆడపడుచులల్లాగే వర్తిస్తారేమో!

* * *

ఋతువులు మారుతున్నాయి. ఓపిక దీపం వోరగా సన్నగిల్లినా, మూలగా పొంచికూర్చున్న మూగచీకట్లను చీలుస్తూ కాస్తో కూస్తో అందగా కన్నీళ్ళు తుడుస్తుంటాయి అడపాదడపా విశ్వనాథం రాసే ఉత్తరాలు. సావిత్రి కిప్పుడు తొమ్మిది నెలలు నిండాయి. రేపోమాపో కాన్పు. కురిసి కురిసి వెలిసిన కుంభవృష్టి ధాటికి పగిలిన పాత కిటికీ తలుపుల అద్దాల్లోంచి అప్పుడప్పుడు బయటికి తొంగిచూస్తూ, ఆరిపోని అశ్రుబిందువులెన్నో తృటిలో ఆశాసాగరంగా మారినట్లు వెయ్యికళ్ళతో చూపుమేరకు పరికిస్తుంది "విశ్వనాథం వస్తున్నాడేమో!" నన్నభ్రాంతి కలిగినప్పుడు కడుపులో దాగిన పసికందు "నాన్నా! అమ్మ నీకోసం కలవరిస్తోంది.... త్వరగా వస్తున్నావ్ కదూ ..." అని చిరునవ్వులతో చిలక పలుకులు పలికినట్టు కలవరిస్తుంది! ఈ స్థితిలో వున్న తన్ను చూడ్డానికి 'స్పెషల్'గా సెలవు తీసుకునైనా రాకుండా వుండగలడా తన విశ్వం మరి!!

నిశ్చలమైన నీళ్ళల్లో
నిప్పంటించి నిద్రపోతున్నది
భవిష్యత్తు!
విధిలేక, గతి తెలియక
వికారంగా పెనుగాలిలో
విన్యాసాలు కొడుతున్నది పంజరం!
విధి రాత కనుగుణంగా
వికటాట్టహాసంతో
విజృంభిస్తున్నది తుఫాను!!

* * *

సావిత్రికి మగబిడ్డ పుట్టిన మూడోరోజున మనియార్డర్ బదులు టెలిగ్రాం వచ్చింది!!!

దేహం చక్కబారిపోయింది ...మూసిన కళ్ళు మూసినట్టే మెదలడం మానేశాయి ... పుట్టిన పసికందు బ్రహ్మరాక్షసిలా కళ్ళకు గంతలు కడుతున్నాడు!! ఇన్నాళ్ళూ తను చేసిన పూజకిదేనా ఫలితం!! అంత పాపానికి తన్ను గురి చెయ్యడానికా జనార్దనస్వామికేమి హక్కుందీ!? ...

అయోమయంగా 'అమ్మ' స్తనాల నందుకునేందుకు, ఆకలితో చేతులూ కాళ్ళూ ఆడిస్తున్న పసిపాపకు కూడా పాపం తెలుసో తెలీదో ఆ ఘోరవార్త!– తనీ లోకంలో తండ్రి ప్రేమకు నోచుకోలేదని!

సైనిక కవాతుల సమయంలో అసందర్భంగా పేలిన తుపాకీ దెబ్బకు మరుక్షణమే ప్రాణం పోయిందట!—విశ్వనాథ మికలేడు.... "భగవంతుడతని ఆత్మకు శాంతి కల్గించాలని"

కోరుతూ "పింఛను కాయితాలు త్వరలోనే పంపిస్తా"మని తెలియజేశారు నిర్జీత సైనికాధికారులు....

జనార్దనస్వామి గుళ్ళో మూలవిరాట్టు విగ్రహం ఇన్నాళ్ళూ 'తళ తళా' కనురెప్పల్లో మెరిసేది! ఒక్కసారిగా 'గిర్రు'న తిరిగి తిరిగి గుండెలేని రాతిముక్కలా గుమ్మంముందర వాలింది సావిత్రి పీడకలలో ..

కుర్రాడి యేడ్పులు తప్ప తనతోపాటు కనీసం యేడ్చయినా తన్ను ఓదార్చేవాళ్ళెవరీ లోకంలో!..

ఏమాట కామాట చెప్పాలి — పరబ్రహ్మంగారి గుండె పగిలింది. కర్మ విపరీతం కాకపోతే, విశ్వాన్ని "సైన్యంలో చేర"మన్న సలహా యివ్వడానికి ప్రపంచంలోని కోటికోట్ల జీవులకూ కాకుండా తనకే తట్టాలా! అయినా తన సొంత తమ్ముడు సైన్యంలోనేగా నిక్షేపంగా కాలక్షేపం చేస్తూంట! ఈ అబల సావిత్రి - ఖర్మమే కాలాలా!- మామూలు రోజుల్లో, యేమోగాని, మహాసాయం పట్టారప్పుడా పరబ్రహ్మంగారూ, వారి యిరుగూ పొరుగూ.... తల్లీ బిడ్డా నీళ్ళు పోసుకునేదాకా, సొంత బంధువుల్లా కించిత్తు లోటు రాకుండా, భయంకరమైన యీ సందిగ్ధ సమయంలో చేదోడు వాదోడుగా చేరుకున్నారు— సావిత్రి ప్రక్కన....

ఒళ్ళు దెలిసినప్పట్నుంచీ సావిత్రికి తెలియని మంటలు మరీ మరీ కడుపు దహించేస్తున్నాయి తను బ్రతికి చేయాల్సిన ఘనకార్యమేమీ మిగిలిపోలేదింకా.... మొగుడు పోయాడని ఏడవడమూ - కొడుకు పుట్టాడని సంతోషించడమూ... గుండెల్లో గుచ్చుకున్న బాకులను సహిస్తూ సహిస్తూ మొద్దుబారిపోయినై మనసూ, కాయా — రెండూ ఒకేసారి ...విందు సముద్రంలో మునుగుతూ మునుగుతూ తేలిన గడ్డిపోచలా చివరకు మిగిలిం దొక్కటే ఆశ-తిమ్మిని బమ్మిని చేసైనాసరే, యీ పసికందును పెద్దవాణ్ణి చేస్తే, తర్వాత, సన్యాసం పుచ్చుకున్నా, గంగలో గుటకవేసి కళ్ళు మూసుకున్నా తనకేం భయం లేదన్నట్టు త్రుటిలో నిశ్చయానికొచ్చిందావిడ....

* * *

కుర్రాడేవిటి!- చిచ్చుబుడ్డీ వాడు! ఊరంతా తిరుగుతాడు; తిండి వేళకు గూడు చేరుకుంటాడు! తల్లి పెట్టిన తిట్లతో కడుపు నింపుకుని కొన్నాళ్ళూ, కన్నీళ్ళు కారుస్తూ, పోయిన తండ్రిని గురించి పూస గుచ్చినట్లు కథలా చెబుతూ "కనీసం నువ్వైనా దారికివచ్చి నన్నుద్ధరించు నాయనా!" అని సావిత్రి గుండె గొంతుకలో కొట్లాడుకుంటూ, కొడుక్కు ఆప్యాయంగా రెండు మెతుకులు పెట్టి, తను పస్తు పడుకున్న కొన్నాళ్ళూ.... పెన్షను డబ్బుల పుణ్యమా అంటూ . ఇలా ఏడియలు గడిచిపోతు న్నాయి . .

ఊసరవెల్లిలా రంగులు మారుస్తూ ఉరకలు తీస్తున్నదీ మాయదారి కాలం! పెద్దయ్యాకైనా తండ్రి అడుగుజాడల్లో కాస్త బుద్ధిమంతుడై "నాయనా ...పూర్ణవిశ్వనాథం!" అని తన కొడుకును నలుగుర్లో గౌరవంగా పిలుస్తారేమో అన్న ఆశ సావిత్రికింకా పోలేదు. కానీ - ఆ రాలుగాయ చెప్పినమాట వినే బాపతు కాదన్న అనుమానం తట్టినప్పుడల్లా సావిత్రి గుండె తరుక్కుపోతుంది.... పెరుగుతున్నకొద్దీ వాడి ప్రవర్తన విచిత్రంగా మారుతోందిమధ్య-! ఇరవై నాలుగు గంటలూ గుళ్ళో సన్నాయిమేళం వింటూనో, టూరింగ్ సినిమాలూ, సర్కసులూ వస్తే టిక్కెట్లమ్మేచోట చెవులు పగిలేలా స్పీకర్లలోంచి తుపాకీ తూటాల్లా ప్రసరించే సినిమా సంగీతంకోసం చెవి గోసు కుంటూనో - వాడి ధోరణిలో వాడు కాలం గడుపుతుంటాడు! ఇల్లూ వాకిలి విషయం సుతరాం పట్టించుకోడు!

సావిత్రి గతి అయోమయంగా తయారవుతోంది రోజుకు రోజూ! కన్నకొడుకు కాపురాన్ని నిలబెట్టే సూచనలు శూన్యం కావడంతో "సర్వం భగవతార్పణ"మంటూ స్వామి గుళ్ళో నమస్కారం చేస్తూ, పదేపదే ప్రదక్షిణాలుచేస్తూ "పాలముంచినా, నీటముంచినా నీవే దిక్కు జనార్దనా" అంటూ, ఇంచుమించు రోజంతా దైవసాన్నిధ్యంలోనే గడుపుతుందామె! అప్పుడప్పు డెవరో "అబ్బాయికి గుమాస్తా పని యిప్పిస్తాం మా కొట్లో చేర్పించరాదూ!" అనో, "మావారీ పక్కవూళ్ళోనే హెడ్ మాష్టరు కదా ... ఎంచక్కా బళ్ళో వేయించి చదివించరాదు టమ్మా" అనో, జాలికబుర్లు చెబుతుంటే, వచ్చిన అవకాశాల నుపయోగించుకోలేని నిజదైన్యస్థితిని తలుచుకుని, మొదట్లో గుండె నీరయ్యేదేమో, ఇప్పుడలవాటైంది సావిత్రికి.

రోజూ చచ్చేవాళ్ళ కేడ్చేవాళ్ళెవరు గనక!....

ఆ రోజు మరొక విచిత్రం జరిగింది ...కాబోయే పూర్ణ విశ్వనాథం.... వురుఫ్ పున్నయ్య, రాత్రి పన్నెండు గంటలైనా ఇంటికి రాలేదు .

రెండు రోజులు....

పది రోజులు....

నెల దాటింది.... పున్నయ్య వత్తా లేదు! కుర్రాడి జాడ గుళ్ళో జనార్దనుడికే తెలియాలి మరి!

తగిలిన గోరుకే తగులుతుందంటారు. నిజమేనేమో! మాటిమాటికీ తనమీద విరుచుకుపడే ప్రమాదాలను చూస్తూ చూస్తూ సమయానికి ముందే ముసలిదైపోయింది సావిత్రి.... కర్ర పుచ్చుకుంటే తప్ప నడవలేదు....

* * *

చావు బ్రతుకులు ప్రపంచానికేం కొత్త గనక! పరబ్రహ్మంగారు కాలధర్మం చేసి కూడా అప్పుడే సంవత్సరం పైగా దాటింది.... ఇహ చాలిక జీవితం సతదా....అటో యిటో తేల్చుకు తీరాలి....

కొండంత భారంతో కుమిలిపోతున్నా దిడీలున కర్ర పుచ్చుకుని లేచింది సావిత్రి.... తన గమ్యం తానే సాధించాలిక... స్వామిని నమ్ముకునేం ప్రయోజనం!.... కానీ, ఇన్నాళ్ళుగా కుల దైవంగా నమ్మిన జనార్దనస్వామి నాఖరుసారిగా చూడకపోతే సావిత్రి మనసొప్పలేదు.... ఎంత కోపమొచ్చినా దేవుడు దేవుడే కదా!— పైగా దీపావళి రోజులవి. బ్రహ్మాండంగా ఉత్సవాలు జరుగుతున్నై గుళ్ళో.. కళ్ళారా చూస్తూనే కళ్ళు మూసుకో వచ్చు.... ఆ విగ్రహం ముందచే తనకు విశ్వనాధం మూడు ముళ్ళు కట్టాడు! ఈనాడు ఖర్మంకాలి తన భర్తను కాలం మింగినా, కొడుకు పూళ్ళపాలైనా, తనకు 'నా' అన్నవాళ్ళంతా నశించి బతకాలన్న ఆశ భస్మమైనా, ఆ స్వామి ఆగ్రహానుగ్రహాలే కారణాలు....

కళ్ళెంలేని గుర్రంలా పలు విధాలుగా పరిగెడుతోంది మనస్సు.... అడుగులో అడుగు వేసుకుంటూ గుడివైపు నడు స్తోంది సావిత్రి.... ఇన్నాళ్ళూ తను భరించిన నిశ్శబ్దంలో దాగిన నిస్సీమిత సంగీతాన్ని మరీ మరీ వినాలన్న కోరిక పెరుగు తోందెందుకో!

గర్భగుడి ప్రాంగణం... కాగడాల వెలుగు....

కర్ణపేయంగా వేణుగానం వినిపిస్తోంది!!

ఇది కలా! నిజమా!.. తానేమిటి వింటున్నది!! తన్ను తాను దహనం చేసుకుంటూ, ఇతరులకు కాంతిపుంజాన్నిస్తూ, దిగజారిపోతున్న కొవ్వువత్తిలా ఆనందంతో కుంగిపోతున్నది సావిత్రి! దీపావళి సమారంభాల్లో, తనకూ తన కులదైవమైన జనార్దనస్వామికీ మధ్యలో తండోపతండాలుగా కూర్చుని సంగీత మాధుర్యాన్ని చూరగొంటున్న ప్రేక్షకులెవ్వరూ కన్పించడం లేదామెకిప్పుడు!

మళ్ళీ విన్నదా శుభవార్త! బ్రహ్మరహస్యంలా ఆమె చెవిలో 'గుస గుస' లాడారెవరో! .... ఎవరో ఏమిటి!!? ఆ జనార్దనుడే అయివుండాలి!!

"నిధి చాల సుఖమా—
రాముని సన్నిధిసేవ సుఖమా....

ఇప్పుడు మీరు విన్న త్యాగరాజస్వామివారి కీర్తన వేణుగానం చేసినవారు బ్రహ్మశ్రీ పూర్ణ విశ్వనాధ విద్వాంసులు!"

స్వామిలో లీనమైపోయింది సావిత్రి.



# నా భుజం మీది నేను

## శ్రీ మల్లాప్రగడ రామారావు

నా భుజం మీద నేను
బరువుగా వేలాడుతుంటాను.
నా మెళ్ళో ఓ దండ పడగానే
చిత్రం!
మంత్రించినట్టు బరువంతా మాయమవుతుంది
నా బిడ్డ కాళ్ళకు చుట్టుకోగానే
అధికారి ఒక మెచ్చుకోలు చూపు విసరగానే
ఒక్క ప్రశంసా వాక్యం (లేదా ముక్క) చెవిన పడగానే
విచిత్రం!
గాల్లో తేలిపోతూ వుంటాను
నా భుజం మీది నేను
నన్ను మోస్తూ వుంటుంది మరి.

ఒకోక్కసారి
(నిజానికి అనేకసార్లు)
ఇంతకు మరింతా అనుభవిసాను.
అప్పుడు
నా భుజం మీది నా బరువుకంటే
భూభారం తేలిక.
ఐతే ఏం–
దించేసుకున్నానని ఎన్నిసార్లనుకున్నా
భేతాళుడి శవం
మళ్ళీ మళ్ళీ చెట్టుమీదికే చేరినట్టు
నా భుజం మీద నేను
బరువుగా వేలాడుతూనే వుంటాను.

---

# విప్లవం గడ్డం లాంటిది

వీరుల గొంతుల్ని నులిమేశా–
చెంపలమీద చెట్లను కోసా–
తెల్లారింది.
మళ్ళీ కొందరు వీరులు – మళ్ళీ కొన్ని చెట్లు–
ఎవడాపును? ఎవడాపును?
ఉదయించే వీరుల్ని – పుట్టుకొచ్చే చెట్లని
అవును విప్లవం గడ్డం లాంటిది.

# లైకో (క్లోరో) ఫిన్

లైకోఫిన్ వల్ల టమోటాలు ఎర్రగా–
క్లోరోఫిన్ వల్ల ఆకులు పచ్చగా–
నీ ఆలోచనల్లో లైకోఫిన్ నదులు పుడ్తే
బతుకులో క్లోరోఫిన్ సముద్రాలే–

(నిఖిలేశ్వర్‌కి – అంకితం)

శ్రీ కోటం చంద్రశేఖర్

డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# శివశక్తి

'సౌందర్యలహరి' జగద్గురువు శ్రీ శంకరులు రచించిందని సంప్రదాయభావన. ఈ మహాకావ్యం 100 శిఖరిణీ వృత్తాలలో శివాశివుల వైభవాన్ని కీర్తిస్తుంది. ఇది కేవలం స్తుతి కాదు. ఆపాత మధురమైన గీతిక. యోగధ్యానభక్తి కర్మజ్ఞాన మార్గాలను 'సమయం'లో లయించిన అద్వైతభూమిక. శ్రీ శంకరులు దీన్ని రాయలేదని కొందరనటం వుంది. రాశాడని అందరూ అంగీకరిస్తారు. రాయలేదని భావించేవారు సన్యాసి సౌందర్య వర్ణనం ఎలా చేస్తాడన్న దృష్టితో- అలా అనుకొంటారు కాబోలు! శ్రీ శంకరుల చరిత్ర ఇదమిత్థమని చారిత్రకాధారాలతో ఇంకా శాస్త్రీయ పద్ధతులలో ఎవరూ నిరూపించలేదు*—

శంకరాచార్యులు చెప్పిన అద్వైతం-పూర్ణ యోగ భావనకు సంబంధించిన దార్శనిక సత్యం. దాదాపు ఈనాటి వైజ్ఞానికుడు ఎవడైనా ఈ సత్యాన్ని అంగీకరిస్తాడు. ఇది ప్రకృతి అని-ఇది పురుషుడని - విభాగించటం లింగ - లింగ వివక్ష కోసమే తప్ప సత్యమది కాదు. అలాంటప్పుడు శంకరుడు పురుష ప్రధానవాదం చేశాడేమని పండితులు 'అపోహ'లో పడ్డారు. బౌద్ధుల 'మాయా' గతి తర్కాన్ని 'బ్రహ్మ' సత్యత్వంతో సమన్వయించకపోతే వైదికమతం మిగిలేది కాదు. ఆ చారిత్రక, అవసరంతో శంకరులు చేసిన పనే మాయావాద ఖండన. శంకరుల వాదనలో రెండు ప్రధాన అంశలున్నాయి. (1) మాయా నిరాసం (2) అవిద్యా నిరాసం.

నిజానికి ఈ రెండూ ఒకే అంశాన్ని స్థాపిస్తున్నా అవి రెండు భిన్న ప్రయోజనాలను సాధించాయి: ఒకటి జగత్తు చాలా సుందరమైంది. మోహకమయినది. అంచేత 'శోక' జనుస్థానం కాదు. నిష్కారణ సంభూతం కాదు — అని చెప్పటం ఒక ప్రయోజనం. నిజమేకాని లోకం స్థితి ప్రవాహరూపమయింది. ఆద్యంతాలు ఎక్కడో వుండగా వ్యక్త మధ్యమా'లహరి'. అంచేత దీన్ని శాశ్వతమని నమ్మకోవటం 'అవిద్య' - చార్వాక లోకాయతులకు ఇది బోధన. మొదటిది బౌద్ధతర్కానికి 'ఒడ్డు'ను చూపటం. ఇలా ఈ రెండు ప్రయోజనాలకు లక్ష్యభూతంగా రచించిందే సౌందర్యలహరి.

ఈ రచన చేసినపుడు శంకరుడు బాలుడని పండితులు అంటుంటారు. ఈ 'బాల భావన' ఆయన శిశుభావానికి లక్షం తప్ప వాచకం కాదు.

> తవ స్తన్యం మన్యే ధరణిధర కన్యే హృదయతః
> పయః పారావారః పరివహతి సారస్వతమివ
> దయావత్యా దత్తం ద్రవిడ శిశు రాస్వాద్యతవయల్
> కవీనాం ప్రౌఢానాం అజని కమనీయః కవయితా (75)

తల్లీ! నీ చనుబాలను పాల సముద్రంలాగా; సర్వ విద్యామృత ధారలాగా నేను తలుస్తాను. దయతో నీ విచ్చిన పాలు తాగినందుకే కదా ఈ ద్రవిడ శిశువు ప్రౌఢ కవుల్లో ఒకడై కమనీయమైన కవిత్వాన్ని సృష్టించగల్గాడు!

ఈ ఉత్ప్రేక్ష వెనుక వైదిక వాఙ్మయం, అలంకారశాస్త్ర సర్వం ఉన్నాయి. వాగ్దేవిని ధేనువుగా వేదం పేర్కొన్నది. ధ్వన్యాలోకలోచనంలో అభినవ గుప్తులు ఈ సంప్రదాయాన్ని వెన్నెముకగా కల్గిన అలంకార భావనను వివరించారు-కవిబాలుడు సరస్వతి అనే గోవు తనంతతానుగా చేపునిచ్చిన క్షీరాన్ని గ్రోలుతున్నారని - శంకరుడిక్కడ కవిబాలుడు. ధరణి ధర్మ కన్య - గిరిజ - సరస్వతి. ఈ శబ్దాలు వైదికార్థంలో చెప్పుకో దగ్గవి - పౌరాణికార్థాలు ఇక్కడ పట్టవు. ఈ మహా మాతృ

---

* నిధి నాగేభ వహ్న్యబ్దే విభవే శంకరోదయః - విభవే మాధవే మాసిదశమ్యాం శంకరోదయః - అని ఒక శ్లోకం పండితులు చెబుతారు. నిది=9; నాగ=8; ఇభ=8; వహ్ని=3; వెరసి కలి 9883 = క్రీ.శ. 788 అని లెక్కకట్టారు. అందుకే ఈ ఏడాది 1200వ సంవత్సర జయంతిని కూడా భారతీయులు జరుపుకొన్నారు.

సౌందర్యాన్ని శిశువు చెయ్యటంలో ఔచిత్యముంది - అందుకే తనను ద్రవిడ 'శిశు' వన్నాడు — ఈ 'ద్రవిడ' శబ్దం వెనుక చారిత్రకార్థంతోపాటు ఒక సాంస్కృతికార్థ మేదో గుప్తమై వుంది. దాన్ని పండితులు వెలికితీయాలి. జగత్తుకి మాతా పితరులు శివా శివులు — వారి సంతాన మీలోకం. అందుకే బాల భావారోపణ ఈ కవి బాలుడు. కవిత్వం ప్రౌఢమైనది ఈ రెండు ప్రయోజనాల్ని కవి శబ్దం ఎలా సాధిస్తోందో చూడండి. చివరి శ్లోకాల్లో, కావ్యతాత్పర్యం ఉంది.

> గిరామాహుర్దేవీం ద్రుహిణ గృహిణీ మాగమవిదో
> హరేః పత్నీం పద్మాం హర సహచరీ మద్రితనయాం
> తురీయాకాపి త్వం దురధి గమన స్సీమ మహిమా
> మహామాయా విశ్వం భ్రమయసి పరబ్రహ్మ మహిషి [97]

ఓ పరబ్రహ్మ పత్నీ! నిన్ను ఆగమవిదులు బ్రహ్మ ఇల్లా (సరస్వతి) అంటారు. లక్ష్మి అని అంటారు. పార్వతి అని కూడా అంటారు. కాని నువ్వు తురీయవు. దేశ కాలాదుల చేత పరిచ్ఛిన్నంకాని — దురధిగమ్యమైన దేశానికి నీవు ప్రభ్వీణివి. మహిమ-మహామాయ-నీ రూపాలు. వీటితో నువ్వు విశ్వాన్ని భ్రమింప జేస్తున్నావు.

తురీయ శబ్దం ఇక్కడ భిన్నార్థాల్ని సూచిస్తుంది పరా వాక్కు, పరాశక్తి - అని తంత్రవాదులు చెప్పిన 'విమర్శాంశ'; ప్రత్యభిజ్ఞాత మవుతున్న 'ప్రకాశాంశ'తో కలిసి వున్నపుడున్న సంపూర్ణస్థితి 'తురీయం' - ఆశ్రమాలలో 'సన్యాసం'గా దీన్నే చెప్పారు ఇక్కడున్నది సంపూర్ణయోగి విరాగానికి వ్యతిరేకార్థం లోకం భావిస్తుంది. కాని సన్యాసి నిత్యం భోగ జీవిత పరిప్లుతుడై వుండి — దాన్ని భ్రమగా గుర్తించి ఒక 'నమస్కారం' పెడతాడు. అందుకే ప్రతిరోజు సన్యాసి ఒక ముత్తయిదువకు తాంబూల పుష్పాలిచ్చి నమస్కరిస్తాడు ఇదొక చిత్రమైన సంస్కృతి. ఇండియాకు ప్రతీకగా చెప్పదగిన స్త్రీ పురుష సంబంధం ఇదొక్కటే వివేకానందుడయినా-అరవిందుడయినా 'స్త్రీ'కిచ్చిన అత్యున్నత స్థానం ఈ 'మాతృ' భావన ఇక్కడ భ్రమ లేదు. యువతి-పాలతి-హరిణీక్షణ-మృగమధ్యా-బింబాధర— ఇవి భ్రమకారకాలు బంధహేతువులు. కాని అవి చాలా తీపిగా వున్న బంధాలు. తంత్రవాదులు-వామాచారులుగా-వామాచారులు రహస్య వర్తనులుగా - సాంఘిక జీవన స్రవంతికి దూరులుగా - ఒకోచోట దండితులు కూడా కావటానికి ఈ ఒక్క అంశమే హేతువు. ఇక్కడ బ్రహ్మధర్మం మాయలో భాసిస్తోందన్న 'వివర్త' వాదభూమిక వుంది బ్రహ్మమే మాయగా పరిణమిస్తోందన్న 'పరిణామ' వాదం తాంత్రికులది వారికి మాయబ్రహ్మ అంతటి సత్యం శంకరుడికి ఇది ఒట్టి 'ప్రవాహం' ప్రవాహానికి అనంతరూపాలు. అనంత శక్తులు ఒకోచోట ఎండి కూడా పోతుంది. ఎక్కడో భూమిని సస్యవంతం చేస్తుంది. అందుకే 'భ్రమయసి' అనటం.

> కదా కాలే మాతః కథయ కలితా లక్తకరసం
> పిబేయం విద్యార్థీ తవ చరణ నిర్ణేజన జలం
> ప్రకృత్యా మూకానామపిచ కవితా కారణతయా
> కదా ధత్తే వాణీ ముఖకమల తాంబూల రసతాం [98]

భగవతి పాదాలకు లత్తుక పూసింది. ఆమె పాదాంబుజాలను కడిగిన నీటిని ఈ కవి శిశువు తాగాడు. దాని మహిమ అసామాన్యమయినది. మూగవాడు మాట్లాడుతాడు. గురుశిక్ష లేనివాడు కవిత్వ మల్లుతాడు ఆపాద తీర్థం ఎలా వుందంటే— అమ్మ నోటితో ఎర్రగా పండిన తాంబూల రసంలాగా వుంది. ఇది జీవితంలో ఎపుడో ఒకసారి మాత్రమే సిద్ధించే పూర్వతపః ఫలం అది నాకెప్పుడో! అని శంకరుల ప్రార్థన.

> సరస్వత్యా లక్ష్మ్యా విధిహరి సపత్నో విహరతే
> రతేః పాతివ్రత్యం శిథిలయతి రమ్యేణ వపుషా
> చిరంజీ వన్నేవ క్షపిత పశుపాశ వ్యతికరః
> పరానందాభిఖ్యం రసయతి రసం త్వద్భజనవాన్ [99]

నీ భక్తుడు విద్యా - లక్ష్మీ విభుడై బ్రహ్మకు విష్ణువుకీ సపత్నుడవుతున్నాడు రమ్యదేహి కావటంవల్ల రతి పాతివ్రత్యాన్ని సడలింప చేస్తున్నాడు ఇంతమాత్రమే కాదు పశు-జీవుల పాశాలను-బంధాలను తెంచుకొని ముక్తుడై పరమానంద రూపమైన ఆనందాన్ని రసాన్ని ఆస్వాదిస్తున్నాడు.

అవిద్యా విద్యాలను మాయా భగవతీ శబ్దాలనుండీ శంకరులు చాలా నేర్పుగా వేరుగా చూడటం నేర్పుతున్నాడు లోకంలో వున్న మానుషానందం-నటవిట సంగీతాభిముఖమైన రసానందాదులు అవిద్యా స్వరూపాలే. సాధకుడికి ఇవి అవరోధాలు— మెట్లన్నమాట - వీటిమీద ఉండిపోవటానికి వీల్లేదు - పైపైకి వెళ్ళదలచినవాడు. రతి శీల విషయం కావ్య సంప్రదాయంలోంచి చూడటానికి వీలుంది. అలా కాకుండా రమ్యవపువుకి ప్రతీకగా గ్రహిస్తే యౌగిక శబ్దమవుతుంది. పాతివ్రత్య శబ్దానికిక్కడ యౌగపద్యమని అర్థం - ఆ దాంపత్యం రతీమన్మథులకు లేదు-లోకం నిరంతర కామ జ్వరపీడితం - ఇక్కడ స్త్రీకీ సుఖంలేదు-పురుషుడికీ లేదు — కామాన్ని దాంపత్య ధర్మంగా మార్చ

కోవటమే శ్రీ విద్యారహస్యాన్ని ఎరగటమంటే — అందుకే లింగ వివక్షతో సంవదించని 'సపత్నీ' విషయ ప్రస్తావన చేశాడు. పార్వతిని కావాలని కోరుకున్న రావణుడు; వాణి నా రాణి అన్న కవీశ్వరుడు; ఇలా సపత్నులు (సమానమైన పత్నిని గలవారు) కావాలని ప్రయత్నించినవారే. కాని విద్యా రహస్యం ఇక్కడితో ఆగదన్నమాట. ఈ దశావస్థలు దాటిన ముక్తవంగైక జీవి ఏ పరతత్త్వ దాంపత్య దర్శనం చేస్తాడో చూడండి.

ప్రదీప జ్వాలాభిర్దివస కర నీరాజన విధిః
సుధాసూతే శ్చంద్రోపల జలలవై రర్ఘ్య రచనా
స్వకీయై రంభోభిస్సలిల నిధి సౌహిత్యకరణం
త్వదీయాభిర్వాగ్భిస్తవ జనని వాచం స్తుతిరియం [100]

ఓ వాక్మాతా! సూర్యుడికి దీపంతో హారతి ఇచ్చినట్టు, చంద్రకాంత శిలలనుంచి స్రవించే జలంతో చంద్రుడికి అర్ఘ్యం ఇచ్చినట్టు; సముద్రజలంతో సముద్రుడికే తర్పణం చేసినట్టు- నీవల్ల పుట్టిన నీ వాక్కు-లచేత నీకి స్తోత్రం.

ఈ శ్లోకంలో ఒక విచిత్రమైన శిల్పముంది. ఈ వాక్యంలో కర్త లేదు. కర్తృ క్రియా కర్మాద్వైతం ఈ వాక్యంలో వుంది దీపదర్శనం - అర్ఘ్యప్రదానం ఆభాసలు కాని మనిషి చేస్తాడు. చేస్తున్నానని కూడా అనుకొంటాడు. దీన్నే రజ్జువుగా శంకరులు వాదించింది. నిజానికిది విశ్వోత్తీర్ణమైన బ్రహ్మ తత్త్వమయం- తప్పా-దీనికి వ్యావహారిక 'అస్తిత్వం' లేదు. అలాగే ఈ స్తుతి- ఈ శబ్దజాలం - నీ వైభవంలో భాగమే. నేను రాయలేదు.

చేస్తూ చేయలేదనటం ఏం తర్కం? ఎవరు చేస్తున్నది? నేను కాదు. నాచేత ఒక శక్తి చేయిస్తోంది. అసలు శివుడికైనా ఆ తల్లిదే ప్రేరణ.

'అహం రుద్రాయ ధను రాతనోమి' అని దేవీ సూక్తం. సౌందర్యలహరి ప్రథమశ్లోకం - దాని అర్థాన్ని చెబుతోంది.

శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచేదేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వా మారాధ్యాం హరిహర విరించాది భిరపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృత పుణ్యః ప్రభవతి [1]

శివశబ్దాన్ని రెండు సంప్రదాయాల్లో పండితులు వ్యాఖ్యానిస్తారు. తుదాదిగా దీప్తి (ప్రకాశం) అన్న అర్థంలోనూ; అదాదిగా కామన (ఇచ్ఛ) అన్న అర్థంలోను.

శివుడు రెండు రకాలు. సదాశివుడు స్థాణువు-నిష్పందుడు. సాదాఖ్య కళతో కూడిన శివుడు — స్వప్నమనే అవిద్యను— పొందిన సస్పందుడు మరొకడు - వీడే జగత్కార్య కల్పన సమర్థుడు.

రెండో శ్లోకంలో త్రిమూర్తులు ముప్పురూ అమ్మ పాద రజాన్ని ధరిస్తారనటంవల్ల - ఈ సృష్టి ఆమె పదోరజం. ఆమెదే ఈ లోకమంతా. రజశ్శబ్దం ధూళి-ని; ఋతువును; ఇచ్ఛను సూచిస్తుంది. కావ్యంలో నాట్యంలో — ఈ లోకంలో కనిపించే ఆకర్షణ-కైశికి-రసతత్వశక్తి 'రజస్సు'-అది స్పర్శించ గానే లోకం ఉన్మిషిస్తోంది. అది తిరోముఖమై గౌరితపస్సుకు పోగానే నిశ్చలమై - సాత్వికమై - శాంతమవుతోంది. ఇదీ రసపరంగా శృంగార - శాంత రసాల నడుమ వున్న ఆవిర్భావ తిరోభావ సంబంధం. అందుకే శంకరుడు 41వ శ్లోకంలో 'నవరస మహా తాండవవటమ్' అని ప్రస్తుతించాడు. ఈ నాట్యం ఎవరిమీద — మహిషిమీద — మహిషాసురుడి కథలు చాలా వున్నాయి — మాయాదేవి కూడా ఒక మహిషి (చూ. 97)— బుద్ధుని తల్లి 'మాయాదేవి' — అన్న విషయాన్ని ఇక్కడ అనుసంధించుకుంటే - సంకేతాత్మకంగా మనకు తెలిసే విషయం రజస్సు ఎందుకు భ్రమను కల్గిస్తుందో!

మనిషి ఎప్పుడూ ఒంటరి — చుట్టూ వున్న సమాజం— అందులో భాగమైన కుటుంబం - దాన్ని కల్పిస్తున్న 'భార్య'— ఆమె అందం; చందం; ఆమెవల్ల కలిగే 'బంధం'-నీటిబుడగలా రప్పుమని పేలిపోయిన క్షణంలో మాత్రమే మనిషికి ఇది 'భ్రమ' అని స్ఫురిస్తుంది. ఆ స్ఫురణ సదా ఉన్నవాడు శంకరుడు. అందుకే 'భ్రమయసి' అనటం.

మనిషి ఆడా కాదు - మగా కాదు-అలాగే ఆ పరతత్త్వం శివుడూ కాదు - శక్తీ కాదు - శివశక్తి. వీరిద్దరూ వేరు కారు. జాయాపతులన్న రూపకం 'అర్థ' శక్తికి సంబంధించింది. ఇది లక్ష్యం మాత్రమే వీరిది 'దాంపత్యం' — దీనికి బహువచనం లేదు. ఇది శంకరుల సౌందర్య సిద్ధాంతం. ద్వివహువచనాలు సృష్టి విస్తరణ సూచకాలు - కాబట్టి 'భ్రమలు' - అదెప్పుడూ ఏకమే. అదే శివశక్తి.



# అంతా నటనే మన మధ్య

## శ్రీ జి. వి. ఆర్. చంద్రమౌళి

రాత్రి రాబందులా తరుముతోంది
ఆకాశం రాక్షసిలా ఉరుముతోంది
జోరుగా కురుస్తున్న ఆవేదనల్లో తడిసి
గుండెకు జలుబు కంటికి ముసుగు పట్టింది.
కలలు కాగితప్పడవల్లా కొట్టుకుపోతున్నాయి కన్నీటిలో
కాలం మురికాల్వల్లో కలిసి
మోగుతున్నాయి చర్చి గంటలు
నీ ఎక్కిళ్ళు వినిపించకుండా
మూగుతున్నాయి చిమ్మచీకట్లు
నీ కన్నీళ్ళు కనిపించకుండా
గుండెల్లో గుబులు మెదడులో దిగులు
ఆలోచనలు కాటేస్తుంటే అనుభూతులు అలలై పోటేస్తుంటే
గుండె పొరలు పొరలుగా విడిపోతున్న బాధ.
కన్నీళ్ళతో కలిసి కాలం బొట్లుబొట్లుగా కారిపోతుంది
కష్టాలతో వేలంవేసి వెర్రిగా నవ్వుకుంటుంది.
బట్టబయలుగా పరుచుకున్న జీవితం
చిట్టచివరికి బాధల లోయల్లోకే దారితీస్తుంది.
మనుషుల అభిశంసనలు మమతల అభినందనలు
ఇవన్నీ కేవలం మిధ్య
అంతా నటనే మన మధ్య!
ఈ చీకటివేళ
కాలం పొద్దున కాళ్ళు బార్లా చాపుకొని
మాటల అలలపై ఏ మనసైనా కొట్టుకువస్తుందోనని
చూస్తూ ఉండాలి.
ఏ జ్ఞాపికల అస్థికలలో హఠాత్తుగా దర్శనమిస్తే
చెప్పులు చేత్తో పట్టుకొని
పారిపోవడానికైనా సిద్ధంగా ఉండాలి.
బ్రతుకు కురుక్షేత్రంలో నువ్వు కేవలం నిమిత్తమాత్రుడివి
అపాయాలకు అవమానాలకు నీవు అభిమానపాత్రుడివి.
నీకు నిద్ర పట్టదు
పక్కలో ఒక్కడివే అటూ ఇటూ పొర్లుతుంటావు
మనిషి జీవితంలో సుఖదుఃఖాల్లా
తలకింద ఒక చేయి
ఒక చేయి నొసటిపై రుద్దుకుంటూ;
చెంపకింద ఒక చేయి
ఒక చేయి కన్నీటిని అద్దుకుంటూ-
రాత్రంతా ఆలోచనలు
మనసంతా వేదనలు
మనసుకు మగతనిద్ర పట్టబోతోంది
ఈలోగా
పరీక్షలకోసం పక్కింటి పిల్లాడు పెట్టుకున్న
అలారం మోగుతుంది
చీపుర్ల చివర్ల నాట్యాలకి వీధుల కళ్ళలో
దుమ్ము రేగుతుంది.
తలుపు తీసి తల బయటకు పెట్టి చూస్తే
ముగ్గేస్తున్న అమ్మాయి ముఖం కన్పిస్తోంది.
అరె అప్పుడే తెల్లారింది!

# కలగూరగంప

## విశ్వనాథ "అస్థిపంజరవము"

తెనుగు సాహిత్యమున కవిత్రయ భారతము, పోతన్న భాగవతములతో దీటైనది శ్రీమద్రామాయణ కల్పవృక్షము.

ప్రస్తుత విషయము: కిష్కింధాకాండ - నూపుర ఖండ మందలి 'దుందుభి' వృత్తాంతమునందు కళాప్రపూర్ణ విశ్వనాథ వారు ప్రదర్శించిన కథన శిల్పచాతురిని పరామర్శించుట. ప్రాసంగికముగా వచ్చిన ఈ కథను సుగ్రీవుడు శ్రీరామునకు చెప్పుచున్నాడు. కథాశరీరము చిన్నది; కథనశిల్పము గొప్పది. అమలోదాత్త మనీషను పట్టియిచ్చుచున్నది ఛందశ్శిల్పము నందారితేరిన వారనుటకిది తార్కాణగా నున్నది.

సుగ్రీవుడు శ్రీరామచంద్రమూర్తి బలపరాక్రమములను విశ్వసింపదలచికోరగా ఆ మహాభుజబలుడు అస్థిపంజరమును విసరెను; పది యామడల దూరమున పడెను.

ఆ అస్థిపంజరము చెడి పనికి రాకపోయిన శీతకిరణు స్థూలకిరణంబులను ప్రాతదూలములను గుట్టగాఁ బోపిరోయనఁ గొండవోనిదట!! అది చూచుటకు కంటగింపు. 'ఋష్యమూక గిరికానన లక్ష్మి శరీరమందు పురిపిడికాయ.'

అట్టి దుందుభిని ఇట్లు వర్ణించుచు సుగ్రీవుడు ప్రారంభించి నాడు. "వేయి యేనుగుల చేవ గలాడు" "దిఖ్ఖురాంచల వికీర్ణ వియద్గత మృత్ప్రయోదర క్రోడ విలాస విష్ణుపద తుత్సిత కాలక ఖావుడు" - అను నీ సుదీర్ఘ సమాసము - పరుషాక్షర విన్యాసము. ఆ అస్థిపంజర వ్యక్తి దౌష్ట్యమును స్ఫురింపజేయుచున్నది. వాని నొంచెదను; వీనిఁ గలంచెదను అను దుందుడుకుదనము, పొగరు గలవాడు దుందుభి. అట్టి రక్కసిదున్న సముద్రుని పైకెత్తి విడిసి, కయ్యానికి కాలు దువ్వు సందర్భమున మధ్యాక్కరను వాడిన తీరు ఆయన ఛందశ్శిల్పజ్ఞతను చాటిచెప్పుచున్నది.

> "కదలి విజృంభించి యసుర కాల్దువ్వి కహకహ నవ్వి
> యది యేమిరా సముద్రా! ధరాంతంబు నావరించితివి
> బెదర నేమిటికి నల్లడుండె విష్ణువన్ పేఁు పెట్టికొని
> కొదువయే సాయమ్ము తెచ్చికొమ్మనా కొమ్మునఁ జెడక.

అంత సముద్రుడు భయపడి 'కెరటముల నొద్దునన్ విరిగింపు కొనియె?' మరచుచే బిగిపిన మల్లుని హిమవంతుని చెప్పినాడు జలధిరాజు.

చెప్పుటయే తడవుగా దుందుభి ఆ కొండతేని క్రోధాడినాడు అప్పటి చంపకములు —— విశ్వనాథ వాడినవి మత్తేభ విక్రీడిత వృత్తగమనమును స్ఫురింపజేయుచున్నవి.

చూడుడు:

> శరభ మృగంబు చొచ్చిన యసాధ్య గజేంద్ర ఘటానుకారిగా
> విరవిరలాడుచున్ విరిసె విస్ఫుట తన్నగ పాదదేశ ప్ర
> స్తరములు పత్యకా శిలలు జారుచు ప్రీలుచు దైత్యశృంగ ని
> ర్భరతర ఘోర దారణ పురాణ నిబంధ వరిశ్లథంబులై
> బురుజుల దున్న కొమ్ములకుఁ బట్టిన యెఱ్ఱని మట్టి హైమభూ
> ధరపతి దేహ యష్టిగళితంబులు కండలవోలె నొప్పని
> ర్ఝరతటినీ ఘటాకృతిక చక్రము కాళ్లల మట్టగింపులై
> బురదల పిండుగా నెగడె బుద్బుద మంధరరావబద్ధమై.

ఇక హిమవంతుడు శిలానిబంధపటు తాహేవాక దోశ్శాలియై కూడ ఈ అవ్యవస్థిత మనస్కునితో మనకేమిలే అని 'నేను నతిభుతా ఋషులను నిదొకగోడు' లేమ్మని తప్పించికొని నాడు. హిమవత్పర్వతము గళితల కౌగిళ్లె మనికిగా మనుచు, త్రాగి తందనాలాడు వాలిని చెప్పి, ఆతనితో తన్ను చెప్పవద్ద న్నాడు. 'కోపమునన్ నా మీదికిని విసరినను విసరుఁ జుమీ!' దుందుభి తన కొమ్ములతో కిష్కింధ గవనుద్వారముకడ మహా ధ్వని చేసినాడు 'అది పున్నమరాత్రి, అమావాస్య దాడి వెడలి నట్లు' - ఎంత చక్కటి ఉపమానము! ఆ మహాధ్వనికి

> 'వాలి పెదవివద్ద వనితా శిరోమణి
> తార చేతనిడు నుదారశీధు
> కనక పాత్ర జారి కాళ్లపై నొలికిన
> క్రొత్త వేఁది వాలి నెత్తికెక్కె.'

అంతతో పోక దుందుభి ప్రఘూణ ఘూర్ణన విశీర్ణ మహార్గళ రావము చేసినాడు. వాలి తటాలున లేచి గవని కడనున్న 'నిర్యాత దక్షిణాక్షతము వోనికాసరము'ను చూచినాడు.

'వంద కాగడాల వెలుతురుచే వెన్నెలలు ఎఱ్ఱవై నవట!' అంతటి ఆశ్చర్య రౌద్రోత్సాహ సంరంభము

నిర్వెల్ల రక్తము లేనట్లుగ పాలిపోయిన హిమగ్రావ రాజుతో పోరాట ఆరునెలలు సాముచేసి మూలమున్న ముసలమ్మను గొట్టినట్లున్నదట! ఎంతటి సందర్భశుద్ధితో కూడినదీ లోకోక్తి ప్రయోగము!!

దుందుభి వాలిని శిఖరసోగ్రగపాయి అనినాడు గ్రావు వాదనిన తనకు అపారమైన వేరమట!

కథావక్తయగు సుగ్రీవుడు ఇదే అదనని అన్నపట్ల తన కున్న వైరభావమును వెళ్ళఁగ్రక్కినాడు

"వాడెటువంటివాడయిన వాదవినట్టిది విక్కువమట!"

వెంటనే వాలి 'మరి దున్నపోతవై యీ గతి వచ్చుటే తెలుపు నేమిర!' అని గద్దరించినాడు.

'కొంచె మాలోచనము చేసికొమ్ము నీదు
తెలివి స్పష్టమ్ముగా నీకె తెలియగలదు'

వారు వెలివప్పుగా జమకట్టి దుందుభిని తేల్చి, పొమ్మన్నా రన్నది వాలి తీర్పు దుందుభి ముల్కువంటి ఈ పల్కు విని తారతో పోవు వాలిపై గిట్టలతో మన్ను చిమ్మి, తగువు నిమ్మన్నాడు.

'సతీసంగవీరా!'

'అరే చేతకాదేని యట్లాడిపోరా'

ఆహా! కళాప్రపూర్ణుల ఛందోగతి విశేషజ్ఞత! భుజంగ ప్రయాతము!!

ఈ దున్న దృష్టిలో వాలి అంగనా సన్నిధిన్ మాటలాడు-దంభములాడు మొనగాడట!

పౌరుష ఖనియగు వాలిని 'తీక్ష్ణ మరుత్ప్రవెగమున దెప్పరమై చనుదెంచుచున్ గుళశ్లక్ష్ణము కొమ్ముచే పొడిచినాడు చండుడు రక్కసి ఇప్పటి 'క్ష్ణ' దుష్కరప్రాస 'వాలి యొరుగడు' 'లయ ఝంఝూపవమానము వాలిని కదల్ప జాలదట!' ఇది సుగ్రీవ ఉవాచ

తుదకు దుంధుభి పక్ష్మభ్రాంతి విచిత్ర చంక్రమణ సంచారుండయ్యు, అనిర్భేద్యకాయుడగు వాలియొక్క తోకకు తగిలింపబడి, 'మూరెడు నాలుక వెలికి జారఁ బుట్టెడు నెత్తురు గ్రక్కికొని' చచ్చినాడు

బలమని యున్నచో నొదల వాఁడునుగాని స్వభావ దుష్టుడై
వెలసిన వాని నొంచెదను పీనిఁ గలంచెదనంచుఁ గారణం
బులకయి సర్వదా వెదకుఁ బొందని కారణముల్ ఘటించు గొం
దళపడు నవ్యవస్థిత మనస్కుఁడు; వానికి సౌఖ్యమున్నదే

ఇది అస్థిపంజర కథా కథనసరళి.

ఈ కథను చెప్పుటద్వారా వాలి బలపరాక్రమములను శ్రీరామభద్రుని కెఱుఁగఁజేయుట వక్తృగతౌచిత్యము అయ్యది కథోపక్రమ, ఉపసంహార పద్యముల ద్వారా చక్కగా పోషింపబడియున్నది 'నాయునికి యిచట సంభవించెను వాలి తాజాలక'

—ఉపక్రమ పద్యము—

క్రమ మెఱుఁగఁడు వాలి; పరా
క్రమమెన్నడు వాలి; వాని కాయ మనిర్భే
ద్యము లయఝంఝూపవమా
నము వానిఁ గదల్పలేదు నలినాంతదృశా!

—ఉపసంహార పద్యము—

అట్టి వాలినుండి రక్షింపుమని సుగ్రీవ శరణాగతి.

కథాకథనము, పాత్రపోషణ, రస నిర్భరత, సంవాద కౌశలము, వృత్తౌచితి, పదబంధ ప్రయోగనైపుణి — ఈ విషయముల ననుశీలించగా దుందుభి విశ్వనాథ కీర్తి దుందుభి యనుట నిస్సందేహోక్తి

—అల్లాడి వేంకటాద్రి

## ఆశోపహతుని లేఖ!

'అల'లా ఎగసిన ఆశ - 'నిట్టూర్పు'లా నన్ను చుట్టేసినపుడు—బ్రతుకు—మోతాదు మించిన అధివాస్తవికతా వచన కవితలా వ్యర్థంగా సాగుతున్నపుడు రాసుకున్న ఆశోపహతుని ఉత్తరం. మాస్టారూ!

రవీంద్రుని 'గీతాంజలి' చదివారు కదూ!

'బందీ! తెంపరాని ఈ సంకెళ్లని తయారుచేసిందెవరు?'

"నేనే! నా ఊపిరితిత్తులతో కొలిమిని ఊది, బలమైన సుత్తిదెబ్బలతో ఇనుపముక్కల్ని కొట్టి-లింకులు తయారుచేసి— ఈ సంకెళ్లని తయారుచేశాను! వాటితో యావత్ ప్రపంచాన్ని బంధించి, నేను మాత్రం స్వేచ్ఛగా ఉండాలనుకున్నాను! కానీ.., తీరా తయారయ్యాక తెలిసింది — ఆ సంకెళ్లు నన్నే బంధించాయని!"

ఈ సాహిత్యము, ఈ కవిత్వము — విమర్శ. ఇవన్నీ మనిషిని 'అతిస్పందితుణ్ణి' చేస్తున్నాయి-'ఆబ్జెక్టివ్‌గా' బ్రతకడం నేర్పుతున్నాయ్! కానీ — సమాజంలో స్వార్థంతో — పూర్తి 'సబ్జెక్టివ్'గా బ్రతుకుతున్న తత్వాలు ఎక్కువైనప్పుడు ఈ స్పందన ఆబ్జెక్టివిజం - రియలిజం - అన్నీ వేస్ట్! కాదంటారా! గుండెలమీద చెయ్యేసుకుని చెప్పండి!! - నిజంగా మీకు గుండె ఉంటే జాలిగా ఆలోచించి చెప్పండి!

*  *  *

నిజంగా 'నేను' నేనులా బ్రతికితే నా చుట్టూ 'నువ్వులు' ఉండరేమో!? అందుకే నేను, 'నువ్వు'లా బ్రతకాలనుకుంటే— నువ్వు అనేది 'చలనరాశి'! అనుక్షణం మారుతుంటుంది!

జీవితం స్థిర వ్యాసార్థంలేని వృత్తం! జస్ట్‌లైక్ అమీబా!! అవసరంవైపు మిధ్యాపాదాలు ప్రసరిస్తుంది!

*  *  *

అనంతకాలపు చరిత్ర ఘోషిస్తోంది సార్! ఒక్కసారి, నాముందు-సోక్రటీస్-బుద్ధ-క్రీస్తు-గెలీలియో-మార్క్స్- ఎవరు? ఎవరు సార్ వీళ్లంతా? ఏం సాధించారు సార్? తమవైన సిద్ధాంతాలను బరికేసి - నాలాంటివాళ్లను నట్టేట్లో ముంచి చచ్చిపోయ్యారు....! ప్రకృతి సత్యాలను వెలికితీసిన శాస్త్రవేత్తలు, అణుయుద్ధాలకు సూటిగా నడిపించారు నా లోకాన్ని!!

సామాజిక సంస్కరణలను రూపొందించిన సంస్కరణవాదులు, తాము బలై, మరికొన్ని బలి మంటపాలను ఎరగాపెట్టి వెళ్ళిపొయ్యారు నాముందు--

*  *  *

"ఏవి తల్లీ! నిరుడు కురిసిన హిమ సమూహములు" అని పొగిడిపోయిన మహాకవిని చూస్తే కోపమొస్తుంది-

ఆనాడేవో హిమసమూహాలు తగలడ్డాయని, నన్ను ఆశపెడితే-అటుకేసి పరుగులు తీస్తే అక్కడ 'కొలంబియా' అగ్నిపర్వతం బద్దలైంది చరిత్ర చీకటి కోణాల్లో-

క్షణంపాటు, చరిత్ర శోధనలో తల మున్కలైతే చాలు- 'ఈ అస్తవ్యస్త వ్యవస్థకు ఆదిమకారణం గోచరిస్తుంది!!!

*  *  *

'ఆర్థిక సంబంధాలే—అన్ని సంబంధాలు' అని సూత్రీకరించాడట మార్క్స్! ఆయన 'శ్రీ'మతి జెన్నీని-ఆయన్ని ముడివేసిన బంధం కూడా ఆర్థికమేనా???— ఏమో- కావచ్చు! తల్లి-తండ్రి-అన్న-అక్క-తమ్ముడు-చెల్లి-మొగుడు-పెళ్లాం— అంతా ఆర్థిక సంబంధాలమీద నడవడం లేదందామా?— లేదు - దీన్ని మించింది మరేదో ఉందని అది "మనసు" (నవ్వొస్తుంది ఈ పదం వింటే)కు గోచరిస్తుందని, అది "అబ్‌స్ట్రాక్ట్" అని అనుకోవడం వట్టి "ట్రాష్"! అందుకే — ఈ సరికొత్త సూత్రంతో నవ జీవితాన్ని ప్రారంభిస్తే ఎలా ఉంటుంది!

"డోన్ట్ రన్ ఆఫ్టర్ అబ్‌స్ట్రాక్ట్ థింగ్స్!"

ఇది నా 'ఆటో సజెషన్'. దేర్ ఈజ్ నథింగ్ ఆన్ ది కోర్ ఆఫ్ ఎర్త్ విచ్ ఈజ్ అబ్‌స్ట్రాక్ట్!

*  *  *

కవిత్వం చదివి స్పందించడం ఒక సైకలాజికల్ వ్యాధి! అసలు కవిత్వమే "క్రానికల్ డిసీజ్"!!

ఆదర్శాలు అంటువ్యాధుల్లాంటివి — అవసరాల మందు రాస్తేగాని క్యూర్ కావు....ఆ మందు వాడకపోతే అది 'కాన్సర్'- 'ఎయిడ్స్'కన్నా భయంకరం!!

ఆదర్శాలకు దమ్మున్న మగాడిలా నిలబడ్డవాణ్ణి 'నెర్వస్' చేసే "నైంటీ పర్సెంట్ ఆఫ్ ది సెవెంటీ క్రోర్స్"కి ఈ సంగతి తెలుసు!!

*  *  *

'వాడు చచ్చిందాకా బాధపడ్డాడు! చచ్చి సుఖపడ్డాడు!! కానీ 'మనసు' (మీరనే అబ్‌స్ట్రాక్ట్‌ది-ఇది) చచ్చింతర్వాత కూడా బాధపడుతుంది - అది బాధపడుతూ మనని చంపుతుంది - అది చచ్చి బాధపడుతూ మన్ని చంపుతుంది! అందుకే ఇలా అనుకుంటే - "మనిషి - మనసు = మనీ+షి"

ఈ సర్వ సమీకరణం ప్రత్యక్షరసత్యం కాదంటే పొరపాటని నేనంటాను! శంకరుని అద్వైతానికి 'రూట్‌కాజ్' 'పెసిమిజం' అని నేనంటాను! మీరేమంటారు - ఎక్కడో దెబ్బ తినిఉంటాడు గురుడు - అందుకే హఠాత్తుగా....

"....సంప్రాప్తే సన్నిహితే కాలే - నహినహి రక్షతి డుక్రుం కరణే" అన్నాడు. మరి ఇప్పుడు నా పరిస్థితి

"....సంప్రాప్తే సన్నిహితే కాలే — నహినహి రక్షతి $E=mc^2$!"

*  *  *

అనగనగా ఒక రాజు....ఆ రాజుకు ఏడుగురు కొడుకులు. వేటకెళ్లి ఏడు చేపలు తెచ్చారు....కథ ప్రపంచంలో ప్రతి భాష

లోనూ ఉందంటే ఆశ్చర్యపడొద్దు! ఆ కథ చిన్నప్పుడు మా బామ్మ నాకు చెప్పి నన్ను మొట్టమొదటిసారి జీవితంలో మోసం చేసింది! ప్రతిదానికి, ఎందుకు? ఏమిటి? అని ప్రశ్నించడం నేర్పింది—చివరకు "చీమ బంగారుపొట్టలో వేలు పెట్టేసరికే.... రాజుగారి చేప ఎండలేదు" అన్న సత్యాన్ని ఒక పెద్ద సిద్ధాంతంతో 'లింక్ అప్' చేసింది! కానీ, ఇవ్వాళ నా 'తోలు పొట్ట'లో వేలు కాదు చేయిపెట్టి మొత్తం తోడేస్తుంటే "రాజుగారి చేప" ఎండక పోవడం అలా ఉంచండి ఎగిరి గంతేస్తుంది? ఎందుకు? ఇక్కడ మార్క్స్-ఎంగెల్స్ జాయింటుగా మోసం చేశారా??-

* * *

"ఎవరు చెప్పు? ఈ వీణని ఇంత అందంగా అలంకరించింది-? ఏ చిగురుటాకుల అంగుళులు దీనిమీద సుస్వరాలను పలికిస్తాయో? అప్పుడెంత స్వరసుర రసగంగ ప్రవహిస్తుందో—?"

వీణని కొనగోట మీటాను - కోటి మందార పూలరెక్కల వీవనతో విసిరినట్లుంది—ఆ నాదం....

"దీన్ని కావలిస్తే తీసికెళ్ళండి—దీని ఖరీదు ఐదు వేలు" అన్నాడు యజమాని-ఆశ్చర్యపోయాను నేను-రసజగత్తునుంచి భావాలు తెరలు తొలిగించుకుని వ్యాపార జగత్తులోకి వచ్చాను-అప్పుడు తెలిసింది - నేనా వీణకు ఐదువేల గజాల దూరంలో ఉన్నానని!

కానీ ఆ వీణానాదం మాత్రం తూరుపు-దూరపు నక్షత్రంలా-గుండెల్లో కలుక్కున తళుక్కుమంటూనే ఉంది!-

* * *

ఒక సునిశితభావం వయ్యారంగా నా హృదయమందిరంలో రూపులు దిద్దుకుంటున్న చిగురుటాకులు పూచేవేళ-

ఒక కర్కశ నిజం నిర్దాక్షిణ్యంగా ఆ భావాన్ని తుడిచేసి గుండె గదిని కడిగేసి మొరటుగా సమాజపు అలవరుసలో నిలబెడుతుంది!

అప్పుడు 'ముదిరిన చింతచెట్టు బెరడులా కాలం' నన్ను స్పృశిస్తుంది!- అసలు, ఆ భావం నాకెలా వచ్చింది? - ఎలా నిష్క్రమించింది-?? అసలు నేనెవరు? "తత్వమసి" అనే 'ఎస్కేపిస్టు' సమాధానం నాకక్కరలేదు! అసలీ అస్తి, నాస్తి విచికిత్సను నాలోకి 'ఇంజెక్టు'చేసి నన్ను పిచ్చివాణ్ణి చేసిందెవరు?

"కాలమే మారుస్తుందిలే" అనే రొటీన్ సమాధానం కాదు నాక్కావలసింది —— "పరిశోధిస్తే దొరుకుతుంది" అన్న 'ప్రోబబిలిటీ' కాదు కావాల్సింది-నిజంగా, నిజం చెప్పమనండి, ఈ 'విశ్వ రహస్యం' ఎవరికన్నా తెలుసా? అసలీ 'విశ్వఘోష' ఎవరికన్నా వినిపిస్తుందా??-

* * *

"కోరికలే అన్ని దుఃఖాలకు మూలకారణం - నిర్యాణమే మనిషి సాధించాల్సింది - అందుకు మార్గం అష్టాంగాలు-" ఇది గౌతమబుద్ధుని సిద్ధాంతం!

వేదోపనిషత్ పురాణాలు ఉద్భవించి - దోపిడీ వ్యవస్థకు వేళ్లూనుకొనిఉన్న అంతకుపూర్వపు 'ఫ్యూడల్' మేధావులకు ఈ చిన్న నిజం తట్టలేదా? ఈ జ్ఞానోదయం ఏ రాజసింహాసనంలోనో - ఏ మున్యాశ్రమంలోనో - మరేచోటనో కలగక-కేవలం హఠాత్తుగా గయలోని బోధివృక్షం క్రింద గౌతముడికే కలిగిందా? ఈ చిన్న సిద్ధాంతం సృష్టించినందుకా, ఆయన వెనకాల బుద్ధుడి వెనకాల శతాబ్దాల ఫాలోఅప్?

కాదు-! దీని వెనకాల మరో కారణం ఉండి ఉంటుంది....

ఏమో.... పరతంత్ర పాలనని సత్యాగ్రహంతో ఎదిరించిన గాంధీజీ అహింసా సిద్ధాంతాన్ని కూడా-నాలాగే ఎవరైనా, భవిష్యశ్శతాబ్దాల్లో నిలవదీస్తారేమో....? నిలదీయొచ్చు—తప్పేముంది?!, నిజానికి గాంధీజీ ఒక్కడే కాదుగా స్వాతంత్ర్య పోరాటం జేసింది-! అలాగే, ఆనాడు గౌతముడు ఒక్కడే కాదు ఇంకా ఉండేఉంటారు చాలామంది - కానీ, ది క్రెడిట్ గోస్ టు గౌతమ - వై? అతడు రాజకుమారు డవ్వటంవల్లనా? లేక సమస్యకు మూలమైన ఫ్యూడల్ వ్యవస్థనుంచి బయటకొచ్చిన 'థింకర్' కావడంవల్లనా??

* * *

ఇలా, నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా-మనల్ని మనం 'సెల్ఫ్ ఎనాలిసిస్' చేస్తూపోతే దొరికే అంతిమసత్యం ఏంటో.... అంతిమ పరిష్కారం ఏమిటో.... ఈ 'ప్రోటోప్లాజమిక్ మేటర్' లోని చైతన్యం కేవలం తాత్కాలికం —— ఈ జీవితం బుడగలాంటిది - అసలీ వ్యవస్థ బుద్బుదప్రాయం....

"వై డు యు థింక్ అబౌట్ ది డెడ్ ఎస్టర్‌డే అండ్ అన్‌బార్న్ టుమారో.... ఎంజాయ్ స్ టుడే...." అన్న ఉమర్ ఖయాం రుబాయత్‌లోని సత్యం "జర్మన్ సిల్వర్"లా తళతళా మెరుస్తుంది——

ఈ జ్ఞానోదయం ఆనాడు బుద్ధుడికి కలిగిఉంటే సన్యాసిగా మారేవాడు కాదు - 'హిప్పీ' అయ్యేవాడు!!- కాదా!..........

(సమాప్తం అనుకుంటే.... అంతే....!)

—శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్

# "చక్కటులు - సామెతలు"

మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు బహుభాషా కోవిదుడు. వాఙ్మయయాజి. బహుముఖ ప్రజ్ఞాశాలి. శతాధిక గ్రంథకర్త. నాటకం, విమర్శ, పద్యం, గేయం, శాసన పరిశోధన-నిరూపణ, భాషాశాస్త్ర గ్రంథ నిర్మాణం మొదలైన రచనా ప్రక్రియలను చేపట్టారు. 125000 పుటలకు సరిపడ దాదాపు 250 గ్రంథాలు రచించారు. వీటిలో కాలగర్భంలో కలిసిపోయినవి అలభ్యాలు పోగా ప్రస్తుతం ఈ వ్యాస రచయితకు లభించిన ముద్రితాముద్రిత గ్రంథాలు డెబ్భై. చిలుకూరివారి అముద్రిత గ్రంథవారాశిలోని అనర్ఘరత్నం 'చక్కటులు-సామెతలు' అనే గ్రంథం. ఈ గ్రంథాన్ని పరిచయం చెయ్యడమే ప్రస్తుత వ్యాసోద్దేశ్యం.

చిలుకూరివారి వాఙ్మయ జీవితలక్ష్యాల్లో సామెతల సేకరణం ఒకటి. ఇది వీరు వ్రాసిన 'ఆంధ్ర భాషా చరిత్రము' తర్వాత చెప్పుకోతగిన మహత్తర కృషి. వాసీ రాశీ కలిగింది. అమిత శ్రమతో నిరంతర ధ్యేయంతో కూడుకొంది. ఈయన 150000 సామెతలను సేకరించాలని ధ్యేయంగా పెట్టుకొన్నారు.(ముందుకు ముందే ఇట్లా సంఖ్యా నియమాన్ని పెట్టుకొని అన్వేషించడం కొంత విడ్డూరంగానే ఉంటుంది) దీన్ని ఒక యజ్ఞంగా భావించారు. యీ సేకరణ సవనం పూర్తి అయితేగానీ 'అవభృథ స్నానం' చెయ్యనని దీక్ష పూనారట! ఎక్కడ ఏ కార్యం కోసం పర్యటన చేసినా సామెతల అన్వేషణ ఆయన మనోసీమలో ఎప్పుడూ మెదలుతూనే ఉండేది. సాహితీప్రియులను విద్యార్థులను కనబడిన ప్రతి పరిచయస్థుణ్ణి "బాబూ! మీదేవూరు? మీకేమైనా సామెతలు తెలుసా? మీ ప్రాంతంలో మీరు విన్న సామెతలు ఎటువంటివైనా చివరకు బూతులైనా సందేహించకుండా నాకు పంపించండి. వాటినన్నింటినీ సేకరించి ఒక గ్రంథం చెయ్యాలనుకొన్నాను." అని అడిగేవారట. 'భాషాయజ్ఞం' అనే పేరుతో ఇందుకోసం ఆంధ్రపత్రికలో (తేదీ తెలియటంలేదు - నవంబరు 1943) ఒక ప్రకటన కూడా ఇచ్చారు. వీరి ప్రకటనకు స్పందించి సామెతలను కొన్నింటిని పంపినవారిలో అల్లూరి సత్యనారాయణ అనే ఖైదీ కూడా ఉండడం విశేషం. వెళ్లిన ప్రతిచోట సామెతలను సేకరించేవారు. ఒకప్పుడు వాటికోసం పనిగట్టుకొని ఊరూరు తిరిగేవారట! ఇంతటి పట్టుదల ఆసక్తి అవిశ్రాంత కృషి చివరకు 150000 సామెతల సేకరణంతో ఫలించింది. కానీ వాటిని ముద్రించే ఆర్థిక స్థోమత లేనందున అవి నాడూ వెలుగును చూడలేదు, నేడూ వెలుగును చూడలేకున్నాయి.

చినారా వారి మరణానంతరం ఆయన ఇతరార్జనలతోపాటి వాఙ్మయనిధీ రక్తసంబంధీకుల చేతులు మారడంలోనూ, అశ్రద్ధ వల్ల పోయినవి పోగా ప్రస్తుతం 80,000 సామెతలు 114 సంపుటాల్లో మిగిలాయి. ప్రస్తుతం చిలుకూరివారి అల్లుడు శ్రీ రామచంద్రరావు (అనంతపురం) పదిలపరచారు. ఇటీవలే శ్రీ సర్దేశాయి తిరుమలరావు వీటిని కొంత పరిష్కరించారు. తెలుగు విశ్వవిద్యాలయం వీటిని పుస్తకరూపంలో ముద్రించాలని ఆలోచిస్తూ ఉంది. ఏలాంటి సాంకేతికావాంతర సైంధవులు, పరిపాలనా నిబంధన వింధ్యలు అడ్డుతగలకపోతే, ఇవి వెలుగునకు వస్తే వీటివల్ల భాషా సాహిత్యరంగాలకు ఎంతో ప్రయోజనం ఉంటుంది.

చినారా సేకరించిన సామెతలు అకారాదిగా ఉన్నాయి. కానీ వాటిని వాటి స్వభావానుగుణంగా వర్గీకరించలేదు. కాగా అవి ఏయే ప్రాంతాల్లో ప్రాచుర్యంలో ఉన్నాయో కూడా చూపలేదు. అయిదారింటి చివర మైసూరు అని కుండలీకరణంతో సూచించారు. రెండింటిని ఇటలీవని సూచించారు. ఇవి తెలుగులోనికి అనూదితాలు.

వీటిలో తెలుగునకు చెందినవీ వచనంలో ఉన్నవీ ఎనభై పాళ్లు. తక్కినవి అన్యదేశ్యాలూ, సంస్కృత న్యాయాలూ, పద్య రూపంలో ఉండే నీతులూ నీతులను తెలిపే పద్యపాదాలు. వీటిని విద్యా, అవయవ, కుల, వృత్తి, వ్యాపార, వ్యవసాయ, మత, నీతి, ప్రకృతి, నిందా సంబంధాదులని వర్గీకరించవచ్చు. వీటిలో కొన్ని మచ్చుకు:-

విద్యా సంబంధులు :

శక్తికిమించి చేసే పనుల సందర్భంలో చెప్పేవి.

అ ఆలు రావు అగ్రతాంబూలము కావాలి

ఆ ఆలు రావు అమరము చదువుతాడంటాడు.

అవయవ సంబంధులు :

కడుపు చించుకొంటే కాళ్లమీద పడినట్లు

చెవులనుబట్టి గాడిదను పోల్చుకోవచ్చు

కుల సంబంధులు :

కోమటి ఊరందరికి ఇస్తాడుగాని తాను తినడు.

గొల్లల గోత్రాలు గొఱ్ఱెల కెఱుక,

గొఱ్ఱెల గోత్రాలు తోడేళ్ల కెఱుక.

వృత్తి సంబంధులు

తలారి పగ తలతో తీరుతుంది.
మగ్గంములోని కండెవరె కొట్టుకోవడము

వ్యాపార సంబంధులు :

దడియము గురువుకు మణుగు శిష్యుడు
సెట్టి తక్కెడ సేయుకు ముప్పావు తరుగు.

వ్యవసాయ సంబంధులు :

తూర్పున కొరడువేస్తే దుక్కొద్దు రంకె వేయునా?
తెగిన చేను తేమ ఓడుతుంది.

మత సంబంధులు :

తాతాచార్యుల ముద్ర భుజం తప్పినా వీపు తప్పదు.
క్రొత్త వైష్ణవానికి ఒళ్లంతా నామాలె.

నిందాపరాలు :

ఒల్లని లంజకు విడువని మిండడు
దుగ్గాణి ముండకు దుడ్డు క్షౌరం.

దెప్పిపొడుపులు :

ఒల్లని మగడా వండిపెట్టరా అంటే
చేతకాని పెండ్లామా చేర్చిపెట్టవే!

ఓబీ ఓబీ (అక్కా అక్కా) నీవు వడ్లు దంచు
నేను ప్రక్క నెగురవేస్తాను.

సంస్కృత లోకోక్తులు :

చింతాజ్వరో మనుష్యాణాం
చింతా సమం నాస్తి శరీర శోషణమ్.

మైసూరు ప్రాంతంలో వాడే తెలుగువారి సామెతలు :

తుంగభద్రకు మంగమ్మ పోతే భంగము తప్పుతుందా?
తుండూపిండు చిక్కిన వెనుక ముండకు దిక్కెవరు?

ఇటలీ సామెతకు తెలుగుసేత :

బూడిదను నాకే కుక్కను పిండికి కాపుంచకూడదు.

ఊర్లపేర్లనుబట్టి అవి యే ప్రాంతానివో తెలుసుకోడానికి వీలైన సామెతలు కొన్ని :

చెంబు చేతిలో ఉంటే కంభము[1] వరకు పోయిరావచ్చు.
జుట్టు పట్టుకొని తంతే జూటూరు[2]లో పడిపోవాలి.

---

1. ప్రకాశం జిల్లాలోది.
2. అనంతపురం జిల్లాలోది

—శ్రీ అవధానం నాగరాజారావు

# వీరభద్రుని ఖడ్గాలు

తెలుగువారు వీరభద్రుని సేవలలోనూ, వివాహాలలో నాక బలి అనంతరం దేగాటలోనూ లయబద్ధమైన వచనాలుగాని పద్యాలుగాని చదువుతూ ఖడ్గనృత్యం చేస్తారు. ఖడ్గనృత్యంతో చదువబడుతూ ఉంటవి కాబట్టి వీనికి ఖడ్గాలని పేరు.

ఈ పేర ప్రత్యేక రచనలున్నట్టు లేదు. కాని నాకు ప్రాచీన తాళపత్రాలలో వ్రాసిపెట్టుకున్నవి ఖడ్గాలపేర రెండు వచనాలు లభించినవి. వీనిలో ఒకటి దేహోదేవాలయ ప్రోక్తః అనేదానికి రూపకల్పన. రెండవది మాంగల్య దేవతయైన గౌరీ దేవికి మాంగల్యాన్ని చేసిన విశ్వకర్మను తెలుపుతుంది. చివర గంగాధరయ్య అనే మకుటంగూడా ఉంది. ఈ గంగాధరయ్య గూడా ఎవరో తెలియదు. ఇవి నాకు 1971 మేలో లభించినవి.

జిజ్ఞాసులెవరైనా ఇతని వివరాలు గూడా తెలుపగలరని ఆశిస్తూ నాకు లభించినవి ఈ క్రింద యిస్తున్నాను.

నిర్మలంబైన నా దేహంబె శివాలయంబు
నిర్మలంబైన నా శిరంబే శిఖరంబు
నా తేజంబె పసిడి కుందనాలు
నా ఖట్వాంగమే ప్రాకారంపు కోట.
నా వాక్తంత్రమే ఆ కోటకు ద్వారంబు
నా కుక్షి గర్భగృహంబు
నా హృదయంబు మీకు సింహాసనంబుగా జేసి,
ప్రాణలింగంబుగా, పూజించి
నా యైశ్వర్యమే త్రిపుండ్రరేఖ
నా స్తుతి గంధ మక్షతలు
నా మృదు వాక్యములే పత్రపుష్పములు
నా వైరాగ్యమే ధూపారతి
నా నిత్యాది క్రమంబులే ధూపసమర్పణంబులు
నా నయనంబులే కడ్డిపత్తులు
నా నాలుక పిడి గంట
నా యోంకారమే శంఖనాదంబు
నా జన్మఫలంబె మీకు నైవేద్యంబుగా జేసి,

# అమృతాంజన్ లిమిటెడ్ వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది

అమృతాంజన్ లిమిటెడ్ 42 45 [illegible] రోడు మద్రాసు 600 004

Amrutanjan Limited 



751

నా త్రికరణంబులే మీకు తాంబూలంబుగా నొనర్చి
అంతరంగుండనై - దాసుండనై
ఆన - నీ పాదంబులాన
అపరం - పరం
శ్రీశైల చెన్నమల్లికార్జునలింగా నమోకృపాంబుధీ!
శివా! ఆకాశమో ఆగసాలెకొట్టం
కూర్మమే కుదురు
భూమండలమే కురుడు
మేరువు పట్టెడ
నీయొక్క శంఖం నిర్మాణంబైన ఊదురుగొయ్య
నీయొక్క నిటలాక్షంబే అగ్నిహోత్రం
సురలే సలుగలు - ప్రమధులు సుత్తెలు
శ్రీహరి వరకట్ట - అర్కచంద్రులు కమ్మెచ్చులు
రాహుకేతువులు పట్టుకార్లు
దేవేంద్రుడే జిహ్వాల కత్తెర
యమధర్మరాజే పెట్టకొమ్ము
బృహస్పతి గుగ్గిలం
పరోపకారమే లక్క
ధర్మమే వెలిగారం
పరివారమే కుక్కపల్లు
సూర్యచంద్రాదులే త్రాసు కప్పెలు
పదినైన్దు అచ్చుగా జేపి,
పద్మాసనంబున గూర్చుండి
పార్వతి వివాహంబునకు మంగళసూత్రము గావించిన
మహేశ్వరుండవు నీవే
పంచముఖాల దేవుండవు నీవే
నిన్ను మించి రెండవ వరుండు గలడా!
కరుణా కటాక్ష గంగాధరయ్యా గురుస్వామీ
అపరం - పరం
శ్రీశైల చెన్నమల్లికార్జునలింగా నమోకృపాంబుధీ!

—కపిలవాయి లింగమూర్తి

# త్రివిక్రముని త్రిపాదములు

భారతి (డిసెంబరు 1988)లో వామనుని త్రిపాద మహిమను శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు చెప్పిరి. కొందరి సిద్ధాంతాలు మూడంకెలో ఉండుటను చర్చించిరి. వామనుడు త్రివిక్రముడు కూడా. కనుక ఈ "త్రి"విక్రముని త్రిపాదాల వ్యాప్తి గురించి మూడంకె ముచ్చటగా వివరిస్తాను.

- హిందువుల దేవుళ్లు త్రిమూర్తులు
- క్రైస్తవుల దేవుడు త్రిమూర్తి
- శివుడు త్రియంబకుడు, త్రిశూలి
- "ముగురమ్మలు" (పోతన)
- కురానులో చెప్పిన ముగ్గురు స్త్రీ దేవతలు (అలాత్, మనాత్, ఉజ్జ)
- త్రయి అంటే వేదం
- ప్రస్థానత్రయం
- త్రిమతాచార్యులు
- త్రిభువనములు
- త్రిగుణములు
- త్రికరణములు
- త్రికాలములు
- త్రివేణులు
- త్రిలింగ క్షేత్రములు
- త్రిచేతనావస్థలు
- సంస్కృత పేర్లకు త్రిలింగములు
- త్రివర్ణ పతాక
- త్రిఋణములు
- త్రికటుకములు
- త్రిదోషములు (ఆయుర్వేదంలో)
- త్రిదోషములు (హోమియోపతిలో)
- సాహిత్యవృత్తులు మూడు (అభిదాది)

- పాశ్చాత్య సాహిత్య "ఇజం" లు మూడు ("క్లాసిసిజం" ఆది)
- అడుగరాని మూలములు మూడు (ఋషిమూలం ఆది)
- తాపత్రయం
- ప్రాణాయామ క్రియలు మూడు
- భారత స్వాతంత్ర్యవీరులు ముగ్గురు "ల్" లు (బాల్, లాల్, పాల్)
- మీమాంసా దర్శనంలో త్రిమతములు
- త్రిమతములవారి త్రిపుండ్రములు (విబూది, త్రిచూర్ణ, గంధ)
- కాల విభజన మూడు విధములు: (1. సృష్టి, స్థితి, లయ 2. ఆది, మధ్య, అంత 3. భూత, వర్తమాన, భవిష్యత్తు)
- ధనమునకు మూడు గతులు
- అబద్ధాలు మూడు రకములు
- బౌద్ధంలో త్రిరత్నములు
- కన్నడ కవిత్రయం
- తెలుగు కవిత్రయం
- గ్రీకు త్రాసద నాటక కవిత్రయం
- ఈషణత్రయం
- త్రివైరాగ్యములు
- ముక్తిమార్గములు మూడు
- భర్తృహరి శతకములు మూడు
- త్రేతాగ్నులు
- జయ విజయులకు మూడు జన్మములు
- సంగీతస్థాయిలు మూడు
- వేదస్వరములు మూడు
- సంగీత జంత్రములు మూడు విధములు (సుషిర, తంత్రి, అవనద్ధ)
- వీరశైవము ప్రకారము దురితమలములు మూడు (ఆణవ, మాయ, కార్మిక)
- దేహమలములు మూడు (మూత్ర, పురీష, స్వేద)
- ఢిల్లీ సుల్తానులు 333 ఏండ్లు, మొగలులు 333 ఏండ్లు భారతదేశమును పాలించిరి.
- దేవతలు 33 కోట్లు
- పూర్తి పింఛనుకు సర్వీసు 33 ఏండ్లు
- $\pi$ విలువ 3 పైచిలుకు (3.14)
- త్యాగము తను, మన, ధనాత్మకము
- ఆపోశనము, శాంతి వాచకము మూడుసార్లు
- త్రిశక్తులు (ఉత్సాహము మొ॥)
- న్యూటను చలనసూత్రములు మూడు
- థర్మో డైనమిక్ సూత్రములు మూడు
- పరమాణువు మూడు ప్రాథమిక కణనిర్మితం. (ఎలక్ట్రాన్, ప్రోటాన్, న్యూట్రాన్)
- రసాయన ధర్మాలు మూడు (ఆమ్ల, క్షార, తటస్థ)
- చరములు ముత్తెరగులు (భూ, జల, ఖేచరములు) (శ్రీనాథుడు దమయంతిని "పల్లవపాణీ, పద్మనయన, రాకేందు బింబాననా" అని భూ, జల, ఆకాశసుందరిగా వర్ణించినాడు.)
- ముగింపుకు మూడు (వేలంపాటలో "తలాక్" మూడు సార్ల నవలెను)
- మూడు పువ్వులు ఆరు కాయలు (సంపత్వృద్ధికి)
- మూనాళ్లముచ్చట (అశాశ్వతమునకు)
- ముమ్మాటికి (నొక్కి చెప్పుటకు)
- మంగళసూత్రమునకు మూడు ముడులు
- ఒక ఆటలో మూడుసార్లు వరుసగా గెలిచినదానికి "దొరదోపిమాయ" (హాట్ ట్రిక్) అనెదరు.
- భౌతిక ప్రకృతి నిర్మాణములో ప్రాతిపదికగా భావించబడే "ఫైబొనాసీ సంఖ్యాక్రమం" (1, 1, 2, 3, 5, 8, 13 ఇట్లే అనంతముగా) లో మన వామనుని త్రిపాదముండుట యాదృచ్ఛికము కాదు.

ముగింపుకు ముక్తాయింపు మూడుసార్లు
తకతోం, దికతోం, ధదికిణతోం

—"పైథగరస్"

# మినీకవితా లోభం

ఇటీవల భారతిలో శ్రీ రావి రంగారావు మినీ కవితకి పౌరుష విశేషణం చేర్చి ఒక వ్యాసం వ్రాశారు. మినీకవిత ఉద్యమస్థాయిలో వుందా? కవితా ప్రక్రియేనా? వచనకవితా సంగ్రహరూపమా? విప్లవ భావప్రతీకా? అనే అంశాల్ని ముచ్చటిస్తూ, కేవలం మినీకవితనే స్పృశించకుండా విప్లవ వచనకవితా ధోరణిని ప్రస్తావించారు - ఎన్నో శతాబ్దాలక్రింద వెలువడిన సమాసభూయిష్ఠ కవితని "చాదస్తం"గా జమకడుతూ, ఈనాటి కవిత్వం సంక్లిష్టయుతం కావడంచేత "ఆధునిక చాదస్తం"గా గుర్తించమన్నారు.

ఏవేవో పొంతన లేని, సంయమనం లేని, పునరాలోచన చేసి స్థిర నిర్ణయం చేయలేని, హేతుబద్ధం కాలేని, ఊహలకి అక్షరరూపం కల్పిస్తే వచ్చే చిక్కు ఇదే.

ఏది ఉద్యమంగా గ్రహింపవలసి వుంటుంది? ఏది కవితా ప్రక్రియగా మాత్రమే స్వీకరింపబడగలిగివుంటుంది? అనే సరైన అవగాహన లేక వారు దోళాందోళిత చేతస్కులై ఈ వ్రాతలు వ్రాశారనిపిస్తోంది.

కవి సమాజాతీతంగా ఊహించినా, నేల విడచి సాము చేయడు - కల్పన హృద్యంగా, భావం గంభీరంగా ఉండేలా కవిత్వ రచనకి సిద్ధపడతాడు — తాను చెప్పదలచుకొన్న అంశాన్ని, ఏ విధంగా చెప్పాలో, ఏ రూపంలో చూపాలో, ఏ దృశ్యాల్ని ప్రతిబింబింపచేయాలో, కవికి స్వేచ్ఛ వుంటుంది. మినీ రచన చేయాలో, మాక్సీ రచన చేయాలో, కవి ఎన్నుకుంటాడు. ఇలాగే వుండాలనే నిర్బంధమేమిటో అర్థంకాదు.

"అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖం" అన్న లక్షణం కాని, "అల్పాక్షరముల నల్పార్థ రచన", అని కాని, అన్నప్పుడు ఫలానా కవిత్వానికి సంబంధించి మాత్రమే అని నిర్ణయించలేము కదా! ప్రతిభ—వ్యుత్పత్తి—అభ్యాసముల మేళనము లేనిదే కవిత్వం జీవగుణం కలిగి వుండదు.

పాఠక సహృదయ హృదయంగమంగా కవిత్వముంటే అది ఆదరణీయమే అవుతుంది. సైద్ధాంతిక ప్రయోజనం తీరిన కవిత కూడా ఇవాళ ఆదృతమవుతోందంటే కవిత్వ జీవలక్షణం ప్రధానం కాని మిగిలిన అంశాలు ప్రధానాలు కావు కదా! జీవలక్షణం కవితలో తొణికిసలాడడానికి, ఏ ఏ విధానాలు స్వీయ కవితకి అవసరాలో కవి ఆలోచనమీదే వుంటుంది.

కవితాభ్యాసకులకి ప్రోత్సాహ మివ్వాలని మినీ కవితా లోభం ప్రదర్శించకూడదు - పాఠకాభిరుచి దృష్ట్యా బరువున్న కవితల్ని కూడా సంపాదకులు తిరస్కరించవచ్చు. అంతమాత్రం చేత సంపాదకులకి ఏవేవో దుర్లక్షణాల్ని అంటగట్టవచ్చా? కవితకీ, ప్రకటనకీ, నినాదానికీ తేడా వుంది.

శ్రీ రంగారావు విమర్శకులని, ఒరిజినల్, డూప్లికేట్, అని విడదీశారు - వారి సునిశిత మేధకి జోహార్లు - విమర్శకి కూడా కొన్ని ప్రమాణాలుంటాయి — తాత్త్విక దృక్పథమూ, సమన్వయమూ వుంటాయి - రాగద్వేష విధానాల్ని బట్టి విమర్శ లుండటం లేదా అంటే ఆయా విమర్శకుల వ్యక్తిత్వ ప్రదర్శకం అవుతుందిగాని, విమర్శక సర్వసాధారణం కాదు గదా!

ఇంక రచన చెయ్యడం అనే అంశం దగ్గరకు వస్తే, ప్రోత్సాహాన్నిబట్టి రచనలు విరివిగా చెయ్యడం జరుగుతుంది. రాశి ముఖ్యం కాదు వాసి ముఖ్యం అనుకున్నప్పుడు గుణమహిత రచన చెయ్యడానికి రచయిత పూనుకుంటాడు. రచనా వ్యాసంగాన్ని ఒక తపస్సుగా భావిస్తాడు. తాను సిద్ధహస్తుడుగా రాణించడానికి ప్రయత్నిస్తాడు—

"వాక్యం రసాత్మకం కావ్యం" అని ఆలంకారిక సూక్తిని ఉట్టంకించిన ఆర్. ఎస్. సుదర్శనంగారి అభిప్రాయాన్ని శ్రీ రంగారావుగారు వారి వ్యాసం చివర్లో ఉదాహరిస్తూ కొన్ని మాటలు వ్రాశారు.

"చెప్పాల్సిన భావం అవసరాన్నిబట్టి వచనకవిత, లేదా మినీకవిత రాయవచ్చు. ఇక్కడ మరో విషయం కూడా అంగీకరించాలి. అది కవుల వ్యక్తిగత అభిరుచికి సంబంధించినది."

ఇటువంటప్పుడు "మినీకవిత"ని గూర్చి శ్రీ రావి. రంగారావు తమ వ్యాసంతో ఎందుకు దోళాందోళన వెలిబుచ్చారు?

—ఎస్. టి. పి. వి. రామానుజాచార్యులు

# గ్రంథ విమర్శలు

## త్యాగరాజ కవిత్వము విమర్శనాత్మక పరిశీలనము

[డా॥ ఎస్. శమంతకమణి, మదరాసు విశ్వవిద్యాలయం, మదరాసు-500 005 వెల: రు. 45/-]

ఆంధ్రజాతి అదృష్టమే. పోతనామాత్య రామదాస, త్యాగరాజ సంబంధం — ఈ ముమ్మూర్తులూ కవిత్రయంలాగే ప్రత్యేక స్థానాల్లో ఉండదగినవారే.

త్యాగరాజు ద్రమిళ దేశములో పుట్టినా బ్రతుకంతా తెలుగుగానే - ఆ పాడిన పాటలూ వ్రాసిన కావ్యాలూ తెలుగుతల్లికి మేలి ముత్యాలహారాలే. ఆ పుణ్యపురుషుని గ్రంథాలనూ కృతులనూ పరిస్తూ డా॥ శమంతకమణి ప్రకటించిన యీ గ్రంథములో

త్యాగరాజ జీవితానికీ గేయ జీవితానికీ గల సాధనదనూ భావార్థ సంపదనూ సాధ్యమైనంతవరకు ప్రదర్శించి ప్రత్యురాలయింది.

మొత్తం పది ప్రకరణాలు. తొమ్మిదవది ప్రత్యేకించి పంచవలసేది. అది 'తెలుగు సాహిత్యములో త్యాగరాజునకు గల స్థానము.'-

రెండు భాషలలోనూ అప్రయత్నసిద్ధమైన పదప్రయోగం చెయ్యగల మహాకవి త్యాగరాజు. 'తాను పాడినదే పాటగా తరువాతి వాగ్గేయకారులకు మార్గదర్శియైన మహర్షి త్యాగరాజు.

ఆనందం రసమైతే అది బాహ్యజీవితానికీ ఆంతర జీవితానికీ కూడా ఆదర్శమవాలి. పర్యాలోచనలో ఆంతర జీవితానందం శాశ్వతం. దానిని ప్రదర్శిన గేయవాల్మీకి త్యాగరాజు.

'శోభిల్లు సప్తస్వర సుందరుల' అనే కీర్తనలో త్యాగరాజు నిగూఢంగా చెప్పిన గాయత్రీ మంత్రతత్త్వమును డా॥ శమంతకమణి వివరించవలసి ఉంది.

ఇలాగే అక్కడక్కడ త్యాగరాజు వాల్మీకి మాటలకి మెరుగు పెట్టిన మాటలవాటం చూపడం-

'అలక లల్లలాడగ' - అనే కీర్తనలో 'ముని కనుసైగ దెలిసి' అనే చరణం-

వాల్మీకి 'వత్స! రామ! ధనుఃపశ్య'-అన్నాడు. త్యాగరాజు కనుసైగ చెయ్యడం అర్థచమత్కృతి — ఇలా ఉంటాయి వివరించవలసేవి-

ఏ- యేమైనా ఇంత కాలానికి ఆ అపర ప్రహ్లాదుని కవితాతత్వాన్ని సాధ్యమైనంతవరకు యీ విమర్శన గ్రంథ రూపాన వెల్లడించిన శ్యమంతకమణి మంగళంపల్లివారన్నట్టు 'ఎందరో విద్వన్మణులు త్యాగరాజును గురించి వ్రాసిరి. అట్టి మణులకు మణిపూస ఈ శమంతకమణి'-

## దుగ్గన నాసికేతోపాఖ్యానము పరిశీలనము

[డా॥ కె. కోదండరామాచార్యులు, ప్రతులకు కె. జానకి 9-11-61, కమాన్ బజార్, ఖమ్మం 507 001, వెల: రు. 50/-]

పురాణాలలో ఉపనిషత్తులో నచికేతుడు, నచికేతసుడు- ఒక సంస్కృత కావ్యములో నాసికేతుడు. దుగ్గన రచనకి యీ సంస్కృతకావ్య కథానాయకుడే మూలం అయి కావ్యం 'నాసికేతోపాఖ్యానం' అయింది.

'నాసాగ్రాన్నిర్గతో యస్మాత్ నాసికేతస్తదుచ్యతే'-

ముక్కుకొననుంచి బయల్వెడలినవాడు కనుక నాసికేతుడు-

ఈ సంస్కృత గ్రంథమునే మూలముగా చేకొని దుగ్గన యీ కృతిని సంతరించాడన్నది నిరూపిస్తూ దుగ్గన సమయ సందర్భాల ననుసరించి కొన్ని మార్పులూ కూర్పులూ చేసినట్లు గ్రంథాన్ని ప్రమాణీకరిస్తూ ఆచార్యులుగారు చక్కని పరిశీలకు లయ్యారు.

రసన్యాయక నిర్ణయమునుగూర్చి మిత్రులు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యంగారు చెప్పినది సోపపత్తికముగా ఉందని నా అభిప్రాయం.

కావ్యకర్త దుగ్గన ఆ బావకి తగినవాడే కావ్య నిర్మాణములో - అని ఆచార్యులుగారు ఋజువుచేశారు. అన్నిటి కన్నా ఆచార్యులుగారి సాంప్రదాయిక విషయ విజ్ఞానశక్తికి సాక్షి హోమసామగ్రి నిరూపణ సచిత్రంగా....

'పాత్రచిత్రణ' శీర్షిక ఆచార్యులుగారి పరిశోధనకి పతాక. శకున, జ్యోతిష పరిజ్ఞానం విషయమై ఇచ్చిన ఆ ఒకటి రెండు ఉదాహరణలు అంత విశేషించి చెప్పదగినవి కావు.

అసమగ్రమైన ఆ కావ్యానికి ఇంత సమగ్రరీతివి వివిధ విషయ ప్రదర్శనతో లోకదర్శనం కలిగించిన శ్రీ కోదండ రామాచార్యులు 'పరిశీలక కోదండరాముడు' అయినట్లు భావించారు.

—యామిజాల పద్మనాభస్వామి

# తెలంగాణా మాండలికాలు, కావ్య ప్రయోగాలు

సంపాదకుడు: డా॥ ఆర్. శ్రీహరి, ప్రచురణ పతంజలి పబ్లికేషన్స్, హైదరాబాదు, 1988, ప్రాప్తిస్థానము: ఆర్. అనంతలక్ష్మి, 16-2-836/ఎఫ్/2, మాధవనగర్ - సైదాబాద్, హైదరాబాద్ 500 659 వెల: రూ. 16/-]

దేశ భేదాన్నిబట్టి భాషాభేదముండునట్లే ఒకే భాషలో కూడ ప్రాంతమునుబట్టి కొన్ని భాషలోను, ఉచ్చారణలోను భేదములు గనవచ్చును ఒక్కొకరు మాట్లాడు తీరునుబట్టి వారే ప్రాంతమువారో సులభముగా గుర్తించకలుగుతాము. కారణము లేవైనప్పటికి తెలంగాణంలో మాట్లాడు భాషకు ఇతర తెలుగు దేశంలో మాట్లాడు భాషకు ఉచ్చారణములోనేగాక, కొన్ని పదముల వాడుకలో గూడ భేదముండును. తెలుగు పదాలే అయినప్పటికి అవి ఆ ప్రాంతములోనే వాడుక యందుండుటయు ఇతర తెలుగుదేశంలో వాడుక యందుండక పూర్వపు గ్రంథములలో గానవచ్చుట గలదు. డా॥ శ్రీహరి వాటిలో కొన్నిటిని సేకరించి సోదాహరణముగా ఈ పుస్తకములో చూపించిరి. అవతారికలో ఈ మార్పులు వచ్చు విధములుకూడ దిఙ్మాత్రంగా సూచించిరి. అట్టి పదాలు కొన్ని వాడుకలోనేగాక కొన్ని కావ్యాల్లో కూడ ప్రయోగించబడుటను శ్రీహరిగారు ఉదాహరించిరి. వాటిని శబ్దరత్నాకరకారుడు చూపకుండుట, చూపినను తెలంగాణాలో మాత్రమే వాటి వాటికిగల విశేషార్థమును తెలుపకుండుట ఇందు చూపబడెను. అట్టి పదాలను నిఘంటువులో చేర్చుట ఎంతైన అవసరము.

'ఉఱుకు' అనే పదానికి 'దాటు', 'దూకు' అనే అర్థాలు మాత్రమే శబ్దరత్నాకరంలో గనుపించును. 'పఱుగెత్తు' అనే అర్థంలో తెలంగాణాలో దానికి సామాన్య వాడకం గలదు. 'బారసాల' అంటే నామకరణం అనే అర్థం కనుపిస్తుంది. కాని ఆ పదం 'బాలసారె' అనే అర్థంలో మిశ్రమసమాసంగా మొదట యేర్పడి నెమ్మదిగా తెలుగుపదంగా రూపొందినట్లు తోస్తుంది. ఇప్పటికి కొందరు పెద్దవాళ్లు 'బాలసారె' అనే వాడుచుందురు. ఈ గ్రంథంలో చేర్చవలసినవాటిలో 'నింగి' అనే పదం కూడ ఒకటి 'నింగి' అంటే ఆకాశం అనే అర్థం కనుపిస్తుంది 'నింగికయి కుంచె యెత్తి' ఇత్యాదిగా (స్వా. 4అ) ఉదాహరించ బడింది శబ్దరత్నాకరంలో. 'నింగి నిక్కి చూచుచు బయలాల కించుచు' అని పోతనగారు గజేంద్రుడి దురవస్థను వర్ణించును ఇది పూర్తిగా ఆకాశమనే అర్థమే కాకుండ 'నిరర్థక ప్రయత్న' మనే అర్థమును కూడా గోచరింపజేయుచున్నవి. ఇంక వ్యవహారంలో తెలంగాణములో చదువురాని ఆడవారు కూడ ఒకరి నొకరు ఆక్షేపించుకొను సందర్భమున 'ఏం, నింగిచూస్తావు' అంటాడు అంటే 'సమాధానం చెప్పచేతగాక చూస్తావు' చక్కగా అర్థమగుచున్నది 'నీళ్ల నములు 'లు' అనేది ఇదే అర్థంలో వాడుచుందుము ఇప్పుడు 'నింగి చూచుట' దానికి నిరర్థక ప్రయత్నము, చేతగానితనము అనే తెల వ్యవహారము అతి స్వాభావికంగా కనుపిస్తుంది తాండవము' కూడ అట్టి పదమే అట్లాగే 'ముల్లె' అంటే డ మూట అనే అర్థం తెలిసిందే తెలంగాణాలో 'నీ ముల్లేమి పోలేదుగా' అని సామాన్యంగా వాడుచుందురు విడిగా కూడ 'ముల్లె' అంటే 'మూట' అనే అర్థంలో సామాన్యంగా వాడుదురు కోస్తా ప్రాంతంలో తక్కువ 'బస్తా' అంటే 'మూట' అనే అర్థంలో తెలంగాణంలో ఎక్కువగా వ్యవహారంలో కను పిస్తుంది వేటేచోట్ల 'ధాన్యం బస్తా' వంటి పదాల్లో వ్యవహార మందున్నది

'బిడ్డ' అనే పదాన్ని శ్రీహరిగారు 'కూతురు' అనే అర్థంలో ఉదహరించిరి కాని మగపిల్లలను కూడ 'బిడ్డ' అని వాడుట తెలంగాణాలో గలదు. అది మొదట స్త్రీ పుం వాచకము గనుకనే మగబిడ్డ, ఆడబిడ్డ అని తరువాత 'మగశిశువు', 'ఆడ శిశువు' పదాలవలెనే స్పష్టార్థము కొరకు రెండూ విడిగా వాడ బడుచున్నవి. ఉభయ సామాన్యంగా దాని వాడుక తెలంగాణాలో

విశేషంగా కనుపిస్తుంది. ఇంకా ప్రాచీన శాసనాలు చూస్తే 'కూంతురు' అనే పదంగూడ ఉభయ సామాన్య మనిపిస్తుంది. కాకుంటే 'ఆడకూతురు' అని విశేషించి స్త్రీవాచకంగా చెప్పుట అనవసరమే యగును. ఒక తెలంగాణా శాసనంలో 'కూస్తు కూస్తురు' అనుభవించగలవారు అనే ప్రయోగం కనుపిస్తుంది. అంటే 'బిడ్డ బిడ్డ తరాన' అని అర్థం తెలుగులోను, 'పుత్రపౌత్ర పారంపర్యంగా' అని సంస్కృతంలోను అర్థము.

శ్రీ హరిగారిబోటి విద్వాంసులు ఇట్టి ప్రయత్నము అన్ని తెలుగు ప్రాంతాలకు విస్తరింపజేసి కృషి చేయవలయును రాయలసీమలోను, నెల్లూరు మండలములో ఇట్టి విశేషము లనేకము గలవు. అట్లే కళింగాంధ్రములో కొన్ని నిజమైన తెలుగు పదాలు వ్యవహారంలో గనుపించును. ఇట్టి కార్య క్రమాన్ని పరిశోధనాత్మకంగా చేబట్టవలసిన అవసరమెంతయైనా కలదు. శ్రీ హరిగారు దానికి శ్రీకారము చుట్టి మార్గదర్శకులైనందుకు అభినందనములు

## ఆంధ్ర జిల్లాల సమగ్ర నామములు

[డా॥ ఎ. విజయ దత్తాత్రేయశర్మ, 2. నవోదయ పబ్లిషర్స్, విజయవాడ 520 002, ప్రాప్తిస్థానం: డా॥ ఎ. విజయదత్, ఆనందపేట, విజయనగరం 531 202]

ఇప్పటివరకు చరిత్ర పరిశోధనలో అంతగా ప్రాముఖ్యము వహించని స్థల నామపరిశోధన ఇటీవలనుండి ఒక పరిశోధనాంగముగా రూపొందుట గొప్ప విశేషము. ఈ పరిశోధన ప్రాక్చరిత్ర కాలమునుండి నవీన చరిత్రవరకు అనేక నూతనాంశములను వెలికి దెచ్చుచున్నదనుటలో సంశయము లేదు. డా॥ విజయ దత్తాత్రేయ శర్మ, ఈ పరిశోధనలో మిక్కిలి శ్రమ చేయుచున్నారు. ప్రస్తుత గ్రంథములో వారు శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలోని గ్రామ నామాలను గూర్చి, దేశవిభాగములను గూర్చి వివరించిరి. ఆయా ప్రాంతాలకు చెందిన చరిత్రాంశములగూడ తగినంత వివరించి చెప్పిరి బౌద్ధమత సంబంధమునుబట్టి యేర్పడిన గ్రామ నామాలను నదీనామాలను పేర్కొనుచు రెండు అనుబంధములు గూడ ఇందు గలవు. ఈ సందర్భములో వారు ఆయా గ్రామాలు ఏయే శాసనములందు పేర్కొనబడినది నిర్దేశిస్తూ అనేక ఆధారాలు చూపిరి. వాటినిబట్టి ఆ గ్రామాల ప్రాచీనతయే గాక చారిత్రక ప్రాముఖ్యముగూడ తెలియుచున్నది. ఇది పరిశోధకులకు అత్యవసరమైన సమాచారము. గ్రామనామాలు సాధారణంగా మార్పుచెందుట తక్కువ. కాని దేశవిభాగాలపేర్లు వాటి మొదటి రూపాన్ని తరచు మార్చుకొనుచుండును. రాజకీయముగా ఆయా ప్రాంతాలను పాలించు రాజుల రాజ్య విస్తీర్ణమునుబట్టి ఆయా విభాగాలు చిన్నవిగానో, పెద్దవిగానో మార్పు చెందెడివి. అట్టివాటిని నిర్దేశించి చెప్పుట కష్టసాధ్యము. అందుకై డా॥ విజయ దత్తాత్రేయ శర్మగారు క్రమంగా శాసనాధారాలను చూపిస్తూ తమ నిర్ణయాలను సూచించిరి. వారి పరిశోధన ప్రశంసార్హమైనది. మిగిలిన ప్రాంతాలకు కూడ వారు ఇట్టి సమాచారము సేకరించి దీని తరువాయి భాగము ప్రకటించి పరిశోధక విద్యార్థులకు, చరిత్రాధ్యాపకులకు ఆధార గ్రంథములు అందించగలరని ఆశించెదము.

—పి. వి. పరబ్రహ్మశాస్త్రి

## వ్యాసమంజూష

[రచయిత: ఆచార్య కర్ణరాజ శేషగిరిరావు, ప్రచురణ: షిర్డీ బుక్ డిపో, గుంటూరు, వెల: రూ. 10/-, [పు. 118]

ఈ గ్రంథం వ్యాసాల సంకలనం. రచయిత సుప్రసిద్ధ సాహితీవేత్త; జానపద విజ్ఞాని; భాషా పరిశోధకుడు 1957–1984ల నడుమ వివిధ పత్రికలలో సంచికలలో ప్రచురణ పొందిన వ్యాసాలను 'వ్యాస మంజూష'గా రచయిత లోకానికి అందించి మంచి పని చేశారు

ఈ గ్రంథంలోని వ్యాసాలలో ఐదు రంగాలకు సంబంధించినవి ఉన్నాయి. (1) జానపద విజ్ఞానం (3, 4 వ్యాసాలు) (2) కళావిమర్శ (4, 5) (3) భాషా విజ్ఞానం (6, 10) (4) తత్త్వవిచారణ (7, 8, 9) (5) కావ్యనాటకాలు (1, 11). ఒక రచయిత ఇన్ని రంగాలమీద రాయటం చాలా అరుదైన విషయం రచయిత దార్శనికుడు కళాతృష్ణ ఉన్నవాడు. తోడుగా భారతీయ సంస్కృతిమీద ప్రత్యేక శ్రద్ధ - ఇన్నిటికి మించి పరిశోధన దృష్టి ఉన్నవాడు కావటంవల్ల ఈ వ్యాసాలు బరువుగా ఆలోచనాత్మకంగా వున్నాయి.

(1) ఉమర్ ఖయామ్ 'రుబాయీ'లకు తెలుగులో వచ్చిన అనువాదాల చర్చ 'రుబాఈ' అనగా చతుష్పది ఇది ఒక ఛందో విశేషము .. రుబాఈలు భోగవాదులకు తగిన వేదాంత సారము గాదు దుఃఖవాదుల వేదాంత సారమనవచ్చును' (పు. 3-4) ఆకిరి శ్రీరామశర్మ, ఆదిభట్ల నారాయణదాసుల మొదలు దేవులపల్లి, స్వామి శ్రీశ్రీలదాకా చేసిన అనువాదాన్ని స్థాలీపులాకన్యాయంగా పరిశీలించారు.

11. హిందీ భాషలో వచ్చిన రూపక సాహిత్యం(నాటకం) మీది వ్యాసం చాలా విషయాల్ని ప్రస్తావిస్తుంది. హిందీ నాట్య చరిత్రను పూర్వ భారతేందు యుగమని; భారతేందు యుగమని; ద్వివేదీయుగమని; ప్రసాద్ యుగమని; ఆధునిక(నాటికల)యుగమని వీరి విభజన. 'ఆధునిక హిందీనాటికలు జాతీయజీవితమును చిత్రించుచున్నవి. ...జాతియ సాంస్కృతిక జీవిత పునరుద్దీపనకు హిందీ రూపక సాహిత్యమెంతయు దోహదపడగల'దన్న (118) వీరి మాటల్లో ఎంత నిజముందో దూరదర్శన్ ద్వారా వస్తున్న నాటికల్ని గమనించినవారికి తెలుస్తుంది

7. ఈ రచయిత తత్త్వదృష్టి మార్గదర్శకం "ఈరాని భాషలో 'స' అక్షరము బదులు 'హ' ఉచ్చరింతురు.... జైహింద్ పదములోని 'హింద్'(సింధ్) రూపాంతరమే ..ఈకె . ఈరాని ప్రత్యయసంబంధి చివరి క్ లోపించి హిందీ అయినది ' (54) - ఇంతమాత్రం చాలు వీరి పరిశీలనలో చారిత్రక దృష్టి వుందనటానికి వేదాగమశాస్త్ర పురాణ తంత్ర శాస్త్రాలతో వీరికున్న పరిచయానికి నిదర్శనం ఈ వ్యాసం ప్రత్యభిజ్ఞను, ఆది శంకరుని, అభినవగుప్తుని సమన్వయించగల రచయితలు ఈ తరంలో కొద్దిమందే వున్నారు వారిలో ఒకరు శ్రీ రావుగారు. ఇలాగే 8వ వ్యాసం పుష్టిమార్గం (వల్లభాచార్యుని శుద్ధాద్వైత సిద్ధాంతం) మీద చర్చ. పోషణం తదనుగ్రహః (2-10-4) అన్న భాగవతకారుని మాటే ఈ పుష్టిమార్గ మూలమని గుర్తిస్తూ-శ్రీకృష్ణలీలామృత ప్రసక్తి చెయ్యటం చాలా బాగుంది. 9వ వ్యాసం మార్మికవాదం - మిస్టిసిజం అన్న మాటకిది అనువాదం. సూఫీమతంలో వున్న మార్మికత — ఇక్కడ ముఖ్యంగా చెప్పబడింది (82):

ఈ భారతీయ చిత్తవృత్తితో కళమీద రెండు వ్యాసాలు రాశారు. 2 'కళ' - యథార్థం - కల్పన నీటి సమన్వయమని ప్రతిపాదన (పు 22) 5 డాడా వాదంమీద - ఇది పాశ్చాత్య దేశాల్లో వచ్చిన ఒక కళావాదం - డాడా అన్న ఫ్రెంచి మాటకు చలాకీ గుర్రమని అర్థం. విధ్వంసక వాదమని పేరు వచ్చినా దీనివెనుక ఒక తాత్త్వికధోరణి వుందని - సర్రియలిజం ద్వారా అది బహిర్గతమయిందని రచయిత గుర్తించారు (పు 42)

3వ వ్యాసం రాజస్థాన్ జానపద నృత్యరీతులు 'ఘూమర్' పైన హోలీ పండుగ సందర్భంలో రాజస్థాన్‌లో స్త్రీలు చేసే ఈ బృంద నృత్యాల వెనుక ఉన్న సాంస్కృతిక చరిత్రను, విలువలను, సంప్రదాయాలను, వేషభాషలను రచయిత పరిచయం చేశారు బంజారాలమీద పరిశోధన చేస్తూ తిరిగినపుడు ఈ నృత్య అవశేషాలు కనిపించాయి బంజారాలకు రాజపుత్రులకు చారిత్రక సంబంధం నిరూపితం. 'నగాడా స్త్రీ ప్రతీక దానిమీద కొట్టు కర్ర పురుష ప్రతీక నగాడా వాయించుట ఉర్వరతా ప్రతీక' (పు 30) దీన్ని 'ఫల్లిసం' అనే అంశంకింద జానపద విజ్ఞానులు చరిస్తారు 4వ వ్యాసం జానపద గాథలు - నాయని కృష్ణకుమారిగారు కథలమీద పరిశోధన తలపెట్టని 1957 ప్రాంతాల్లోనే ఈ వ్యాసం వీరు రాశారంటే ఆశ్చర్యమవుతుంది ఇది ఒక ప్రవేశిక వ్యాసం

కడపట చెప్పదలచిన వ్యాసాలు. 6 భారతీయ భాషలలో పరస్పరం ఎలాంటి ఆదానప్రదానాలు జరిగాయో చర్చిస్తూ ముందా, ద్రావిడ - భాషల వైశిష్ట్యాన్ని గురించి వీరు ప్రస్తావించిన అంశాలు ఆసక్తికరంగా వున్నాయి (చూ పు 40-48) 10వ వ్యాసం కీర్తిశేషులు సునీతకుమార్ ఛటర్జీమీద-వారి దగ్గర శేషగిరిరావుగారు 1955లో శిష్యరికం చేశారట - అంచేత గురువుగారు మరణించినపుడు రాసిన స్మృతి వ్యాసమిది. ఛటర్జీ సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త.

ఇంత రాసిన వీరు కూడా హిందు అనే మాటలో ఒకో అక్షరానికి ఒకో అర్థముందని (పు 54) భావించటం సబబుగా కనిపించటంలేదు ఇది సింధు శబ్ద రూపాంతరమని వీరే గుర్తించారు కూడాను. రచయితకు భారతీయ సంస్కృతి అంటే అంత గౌరవమన్నమాట — అనే మనం సరిపెట్టుకోవాల్సి వస్తోంది.

— హెచ్. ఎస్. బ్రహ్మానంద



Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna, Vijayawada Phones 75667 & 61247